# జగన్మిథ్యా - తత్త్వపరిశీలనము

Acc No 14673

ప్రకాశకులు ;

**తెలుగు శాఖ**

శ్రీఅరవిందాశ్రమము, పుదుచ్చేరి–605002.

ప్రచురణ :

తెలుగుశాఖ, శ్రీ అరవిందాశ్రమము

పుదుచ్చేరి -605002.

హక్కులు శ్రీ అరవిందాశ్రమము ట్రస్టు

ప్రథమ ముద్రణ : ఏప్రిల్ 1976

ప్రతులు . 750

వెల . 2-50

ముద్రణ : ఆంధ్రభవన్ ప్రెస్,

పుదుచ్చేరి-605001.

# విషయ సూచిక

# ము న్నుడి!

ఈ సంధికాలంలో, శ్రీ యుతులు టి. కోదండరామారావుగారు వ్రాసిన "జగన్మిధ్యా తత్త్వ పరిశీలనము" — అను యీ చిన్న పుస్తకము, ఆధ్యాత్మిక జిజ్ఞాసులు ఒక అడుగు ముందుకు వేయుటకు యెంతైన సహకరింపగల దనుటలో సందేహము లేదు

ఈ నాటికిని అనేకులు ఆధ్యాత్మికమనునది వొక ప్రత్యేక జీవనమనియు, యీ జగత్తు మిధ్యయనియు విశ్వసించుచున్నారు. అట్టి వారలకు ఇందలి వివరణ, గీత—ఉపనిషత్తుల ఆధారముగ ఒక నూతన వెలుగును ప్రసరింప జేయగలదని విశ్వసిస్తున్నాను.

ఈ విషయములనే శ్రీఅరవిందులు తమ స్వానుభవముతో విపులీకరించి యున్నారు

శ్రీ కోదండరామారావుగారు, కొంతకాలము శ్రీ అరవిందుల సమక్షమున సాధనచేసి, కొన్ని అనుభూతులను పొంది, ఒక స్థితిని అందుకొనిన సాధకులు. ప్రత్యేకించి, ఆ రోజులలో శ్రీఅరవిందుల పూర్ణయోగ సాధనను ఆకాంక్షించి, అనుసరించిన తెలుగువారిలో వీరు ఒకరు. శ్రీఅరవిందుల స్పర్శ, వెలుగును పొందగలిగిన శ్రీ కోదండరామారావుగారి యీ కృషి ద్వారా, "జగత్ మిధ్యయా, సత్యమా?"యను సమస్య తొలగి నూతనమైన దివ్యమార్గము గోచరింపగలదని ఆశించుచున్నాను

శ్రీ కోదండరామారావుగారు, ఇలాంటి విషయములను యింకా విపులముగా తెలుగు ప్రజలకు అందించాలని; అందులకు తగు శక్తి సామర్ధ్యములను వారికి ప్రసాదించమని శ్రీ మాతారవిందులను ప్రార్ధిస్తున్నాను.

- రాజు

శ్రీఅరవిందాశ్రమము

# పీఠిక

భారతదేశములో వైదిక విజ్ఞాన ధర్మములు, సన్నగిల్లినపుడు పాషండ మతములు, జగన్మిథ్యా తత్త్వములు బయలుదేరినవి. ఇందుల ఫలితముగ వేదోపనిషదులలోని సమగ్ర జ్ఞానమును తెలిసికొనలేక, సంయోజనా శక్తి, జ్ఞానములు గోల్పోయి, ఏకపార్శ్వజనిత వియోజనా దృక్పథముచే, సమన్వయ భావములంతరించి, విపరీతార్థములతో తత్త్వశాస్త్రములు, బోధలు ప్రజానీకమునకందుబాటాయెను. బౌద్ధులు, శాంకరీయులు, జగన్మిథ్యా తత్త్వములకు, సన్న్యాస జీవనమునకు నెక్కువ ప్రాముఖ్యత నొసగిరి మోక్షము సంపాదింపవలెనన్న జగద్విముఖులగుట శ్రేయోదాయక మనియు, ముక్తినొందిన తర్వాత జగత్తునుండి పలాయన మగుటయో, లేదా శరీరము పడిపోవువరకు ఏదోనొకవిధముగా శరీర యంత్రమును ప్రకృతికధీనులై నడిపించవలెననియు, తలపబడెను ఈ విపరీత భావమహిమచే, భారతదేశమునందలి శ్రేష్ఠజనులు కర్మయోగమునకు, దివ్యకర్మానుష్ఠానమునకు దూరమై, స్వాతంత్ర్యమును బోగొట్టుకొని, విదేశీయులకు బానిసలైరి

భగవత్కటాక్షమునను, కొందరి మహనీయుల త్యాగశీలములవలనను, భారతదేశమునకు స్వరాజ్య ప్రాప్తి కలిగినది. కాని, పూర్వభావములింకను భారతావనిలో నశించలేదు. వేదాంతమనిన కర్మసన్న్యాసమనియు, ముక్తినాకాంక్షించుటయన, సంసారమును విడనాడుటయను మొదలగు భావము లింకను ప్రచారములోనున్నవి

భారతదేశమునకు ప్రపంచమునకును, నూతన వేదాంత దృక్పథము

చూపిన మహనీయులలో శ్రీఅరవిందులగ్రగణ్యులు. వీరు తమ అఖండ విజ్ఞాన శక్తితోను, పూర్ణయోగసాధనా సంపత్తితోను, వేదోపనిషత్తులు, భగవద్గీత మున్నగు గ్రంథములలోని సమగ్రజ్ఞానమును మనకందజేసియున్నారు. శ్రీఅరవిందులయుద్గ్రంథమగు "దివ్యజీవనము" (The Life Divine) లో మానవుడు విజ్ఞాన స్థాయిని (Supramental Status) బొంది, దివ్యకర్మలే విధముగ ప్రపంచ ప్రగతి కళ్యాణముల కొరకు చేసి తరించవలెనను విషయములు, మహోన్నతముగా వివరించి యున్నారు. ఈ "దివ్యజీవనము"లోని. క్లిష్టము సుదీర్ఘమునగు రెండధ్యాయముల సారాంశమే, ప్రస్తుత పుస్తకము యొక్క మొదటి రెండధ్యాయములు. మిగిలిన అధ్యాయములు నేను స్వతంత్రించి వ్రాసినవి.

ఆంధ్రలోకమునకివి యుపకరించునను భావముతో, 'అఖిల భారత పత్రికలో' యీ వ్యాసములు మొదట ప్రచురితమైనవి. పై పత్రికా సంపాదకులును, శ్రీఅరవిందాశ్రమ సాధకులునగు శ్రీ రాజుగారి సౌజన్యముతో, "జగన్మిథ్యా తత్త్వపరిశీలనము" ఒక పుస్తకరూపము దాల్చినది. పూజ్య శ్రీరాజుగారికి నేనెంతో కృతజ్ఞుడను. పాఠకులీ గ్రంథమును చదివి మేలు పొందినచో, నా శ్రమవృథాకాలేదని తలంతును.

అనంతపురం
14-3-1976.

ఇట్లు,
తుమ్మగుంట కోదండరామారావు.

# జగన్మిథ్యా తత్త్వ పరిశీలనము

## మనస్సు - స్వప్నము – మతిభ్రమణము

క్షణ భంగురమై తుచ్ఛ సుఖములుగల యీ లోకమునందు జన్మమెత్తిన నీవు నన్ను శరణుపొంది భజింపుము. (భగవద్గీత, 9.33)

ఈ ఆత్మ, హృదయములోనుండు జ్యోతియు, విజ్ఞాన పురుషుడునై యున్నది. అది సత్తాయొక్క అన్నిస్థితులలోను సమానముగ నుండి, ఉభయ లోకములలోను సంచరించుచుండును. అది స్వప్న పురుషుడై లోకమున కతీతమై మృత్యురూపముల నతిక్రమించును

ఈ పురుషునికి రెండు స్థానములున్నవి: యీ లోకము, పరలోకము అనునవి: మూడవస్థితి, యీ రెంటియొక్క మధ్యస్థానము. ఇదియే స్వప్న స్థితి. ఇందులో, యీ కలియక స్థానములో నిలిచినపుడు, ఉనికియొక్క రెండు భూమికలగు యీ లోకము, పైలోకము రెంటిని జూచును. అతడు నిద్రించునపుడు, యీ ప్రపంచముయొక్క సత్తాను, తన సత్తాను, గైకొని, తన స్వయంజ్యోతి ప్రకాశములతో, నిర్మాణములను కట్టును. ఈ చైతన్య పురుషుడు నిద్రించునపుడు, తన స్వప్రకాశముతో ప్రదీప్తుడగును. బాటలు,

రధములు, సుఖములు, దుఃఖములు, చెరువులు, గుంటలు, నదులు యివేవీ గాని లేవు. కాని, తాను సృష్టికర్త అయినందున, వీనిని తన ప్రకాశముతో సృజించును. నిద్రచే శరీరమును విడనాడి నిద్రించక నిద్రించు వారిని జూచును. ప్రాణశక్తిచే శరీరమును సజీవముగ నుంచి, శరీరమునుండి నిష్క్రమించి, అమరుడగును. అమరుడై ఈ హిరణ్మయ పురుషుడగు పరమహంస తన ఇచ్చవచ్చిన చోటికేగును.

"జాగ్రత్ లోక మతనిదే :
ఏలన అతడు జాగ్రత్ స్థితిలో జూచునదే నిద్రావస్థలో జూచును"
అని చెప్పబడినది కాని, అతడచ్చట స్వయంజ్యోతిర్మయుడు
బృహదారణ్యక ఉపనిషత్తు: (IV: 3, 7, 9–12, 14)

చూచినది, చూడబడనది, అనుభవించినది, వున్నది, లేనిది అన్నిటిని అది చూచును. అది సర్వమై చూచును.
ప్రశ్నోపనిషత్తు. IV (5)

మానవ చింతనము, సర్వమానసికోను భూతీయును, ఆస్తిక, నాస్తికతల మధ్య నూగిసలాడుచున్నది. మానవుడు దేనినైనను ఉన్నదనికాని, లేదనికాని ప్రవచించి నిర్వచించగలడు. వ్యష్టిని, విశ్వమును అతీతమును వీనిని సత్యమని కాని, మిథ్యయనికాని నిరూపించవచ్చును. ఎందుకన, మానవ చింతనమునకు, సత్యముయొక్క యదార్థము గోచరింపనందున, దాని కన్నియు సాధ్యములుగను, సంభావ్యములుగను, కనబడును. అటులనే,

మానవ ప్రాణమయ సత్తాసహితము జీవిత పరిధులయొక్క నిత్య విలువలను దృఢముగా కనుగొనలేకయున్నది. మన స్వభావము కనబడుదాని నంతటిని నిజమని భావించి, దాని కావలనుండు సాధ్యముల నూహించి, తుదకు తాను సత్యమని యనుకొన్న సమస్తమును అనుమానించి ప్రశ్నించుచున్నది. దీని కంతకు మూలము మానసిక అజ్ఞానము.

ప్రప్రథమమున మానవుడు, భౌతిక మనస్సులో నివసించును. భౌతిక మనస్సు (Physical mind) లో నివసించి, అతడు కంటికగపడు దాని నంతటిని నిజమని తలంచును. ప్రత్యక్షముగనున్న దానిని గోచరించినదానిని నిజమనును. అదృశ్యముగనున్న దానినంతటిని అబద్ధ మనును. పదార్థ విజ్ఞానశాస్త్రము యీ వైఖరినే నడుచుచున్నది ఇంద్రియములకు దృశ్యము గానివి గోచరించి వాని యదార్థత, భౌతిక దృష్టికి నిరూపింపబడినపుడు మాత్రమే యీ శాస్త్రము వానిని సత్యమనును. కాని మానవునియందు భౌతిక మనస్సేగాక ప్రాణిక మనస్సు (life mind) ప్రాణమయ మానసికము లున్నవి. (vital mentality) ప్రాణిక మనస్సు కోరిక కుపకరణము.

ప్రాణికము ప్రత్యక్షముతో తృప్తిపడక, సంభావ్యతల నూహించి, వాని భోగ్యత కువ్విళ్ళూరుచుండును. ఇది భౌతికములో ఉన్నదాని ననుభ వించుట కిష్టపడక, లేనిదాని నూహించి, భావపూరితముగ గోచరించుదానిని భోగింప ప్రయత్నపడును. ప్రాణమయ సత్తాలేనిచో మానవుడు భౌతిక మన స్సులోనేయుండి, తామసిక జీవనమును జంతుసమానముగ జరుపుచుండును. లేనిది కావలెనని కోరినపుడు, అది లభ్యము కానపుడు, అసంతృప్తి కలిగి మానవజీవితము అది సఫలమగుటకు యెన్నియో ప్రయత్నములుజేసి, ఆశా నిరాశలకు గుఱియగుచున్నది. ప్రాణమయ సత్తాయొక్క ఈ ప్రాణక్షోభ

మును కలవర పరచుటకు చింతనా మానసికము (Thinking mind) కూడ సహాయపడి, భౌతిక ప్రాణమయ చేష్టా ప్రవృత్తుల యలజడిని శమింప జేయుటకు బదులు వీనినుత్తేజపఱచి మానవుని అశాంతిలో త్రోయుచున్నది.

ఈ విధముగ మానవకోటి సత్యసుఖమునుగాంచలేక, జీవిత యదార్ధ లక్ష్యములను గనుగొనలేక యున్నది ఈ అశాంతిలో కొంత తడవేగిన తరువాత మానవుడు తుదకు భౌతికముయుక్క సత్యత్వమునుకూడ ప్రశ్నించి మన కగబడుదాని నంతటినిగూడ మిధ్యగా భావించును. ప్రాణమయమనస్సు జీవితములో తానూహించి పొందతలచిన భోగభాగ్యములు చేకూరనందున, జీవితమును నిరసించుచూ, జీవితము, జగత్తు, సర్వము భ్రమయనియు, మాయయనియు, వీనినన్నిటిని త్రోసివేయును. చింతనా మనస్సుకూడ యిదే విధముగ, జగత్తులోను, జీవితములోను సత్యములేదనియు, యివన్నియు మనోకల్పితములనియు, వీని కావలనున్న ఒక కేవలమైన వస్తువేదైన నున్నచో, అదియే సత్యమనియు, యీ కనపడునదంతయు భ్రాంతియనియు, స్వప్నతుల్యమనియు తలచి, సత్యజగత్తును మిధ్యాజగత్తుగా భావించును. ఇట్టి పరిస్థితులలో జగన్మిధ్యా తత్త్వము, మతములు, బయలుదేరును

భారత దేశములో, జగన్మిధ్యా తత్త్వమునకు మతమునకు సాయపడి, దోహదమిచ్చి అత్యద్భుతముగ నిరూపించినవారు బుద్ధుడు, శంకరుడు. ఈ మహనీయులు గావించిన మహత్తర జగన్మిధ్యా తత్త్వములు, భారతీయుల మతము, భావము మనోపై ఖరిపై శక్తివంతముగ ప్రసరించి వారిని మాయా వాదములో ముంపివేసినవి. ఈ మహనీయుల మధ్యకాలములోను వారి తరు వాతనూ వీరిరువురి తత్త్వములను పరిశీలించుచు, వీని ఉత్కృష్టతను ఖండిం చిన మతములు కొన్నియున్నను, ఈ ప్రముఖులుద్ఘోషించిన భావతత్త్వముల

బలమును సన్నగిల్లజేయుట కివి చేతగాని వాయెను. కనుక జగన్మిధ్యా తత్త్వముయొక్క యదార్థతను, భావమును మనమిపుడు క్రొత్తగా తీక్ష్ణముగా క్షుణ్ణముగా పరిశీలింపవలసి యున్నది.

ఒకే సత్యమునుండి రెండు తత్త్వములు విడదీయబడుచున్నవి. అనగా బౌద్ధము, శాంకరీయములలో, ఒకే సత్యమునుండి, మిధ్యాజగత్తు సంభవించుచున్నది. ఈ మతములకు భిన్నమగు తత్త్వములో ఒకే సత్యము నుండి సత్యమైన జగత్తు సంభవించుచున్నది. మానవుడు చేయుప్రయత్నము లన్నియు సఫలము కాకపోవుటయు, జీవితము దుఃఖము, కష్టము, బాధ మొదలగువానితో నిండియుండి, వీని కతీతుడుగ గాక పోవుటయు నిరాశకు కారణములు అందువలన జగత్తు మిధ్యగా పరిగణింపబడుచున్నది క్రైస్తవ ప్రేమ, భౌద్ధకరుణ, లేశమాత్రమే ఉపయోగపడినవి అవిద్య, దుఃఖము, బాధ యివియే ఎక్కువగా కనబడుచు, వీనికి విరుద్ధములగు విద్య, ఆనందము సౌఖ్యము అతి తక్కువగా నున్నవి. అందువలన ప్రపంచము దుఃఖమయము ఇందులోని జీవితము క్షణికము బాధాయుతము.

గనుక జగత్తును వీడి, మరొక ప్రదేశమునకు, లేక స్వర్గమునకు బోవుట, జీవునియొక్క పరమావిధిగ పరిగణింపబడుచున్నది కాని మనము నిజముగా తర్కించి చూడగ, రెండు సమస్యలు విదితమగుచున్నవి. మొద టిది, జగత్తులో దుఃఖము, బాధ, పాపము మొదలగునవన్నియు స్థిరముగా నుండుటకు నిర్మింపబడినవియై, అవి స్థిరములా? అట్లయినచో, యివి ఒకా నొక అచేతనా శక్తిచే సృష్టింపబడినవై, అందుచే వీనినుండి విముక్తి నొందుట అసాధ్యమని తేలుచున్నది. లేదా యీ లోకము కష్టములకు, అప జయములకు స్థానముగా నిర్మింపబడియుండినచో యీ లోకమునుండి మరొక

చోటికి పలాయనమగుట తప్పనిసరియై. జగత్తంతయు మిథ్యామయముగా గోచరమగును రెండవది యీ ప్రపంచము ఒక దివ్య సత్యమై బ్రహ్మము యొక్క సృష్టియై కొన్ని పరిధులలో, ఆ దివ్యముయొక్క వికాసమునకు, కష్టము, బాధ, మొదలగు వికారములన్నియు మధ్యరంగములో జనించిన వైనచో యివి తాత్కాలికములు. అస్థిరములైనచో నిరాశకును భ్రాంతికిని, మాయకును చోటుండదు.

అట్టితరి, యీ వికారములన్నియు, యీ సుఖదుఃఖ, జయాపజయ, విద్యా అవిద్య, మొదలగు ద్వంద్వములన్నియును, జీవుని మనో,ప్రాణ భౌతి కములును, దివ్య పరిణామ మొందుటకు అనుభూతి విధానములుగ నిర్మింప బడినట్లు విదితమగును అప్పుడు శక్తిహీనమగు సృష్టికిని, జగన్మిధ్యాతత్త్వ మునకు మాయాజనితమగు భ్రమకును తావుండదు

కాని జగన్మిధ్యాతత్త్వమున కింకొక ఉపాదానము కూడకలదు అదే మన, ఉనికి యంతయు ఒక సత్యమే, ఒక బ్రహ్మమే. అది విశ్వాతీతము పరాత్పరము జగత్తంతయు సత్యవిరుద్ధము, అబ్రహ్మము, అస్థిరము, మానవ జీవితము దివ్యజీవితముగ పరిణమించినను జగత్తుయొక్క అనిత్యత మాసిపోనేరదు జగత్తు పూర్ణమిధ్య గాకపోయినను, బ్రహ్మకైవల్యమును బొందినపుడు, జగత్తు సత్యముగాదని గోచరమగును. ఈ తత్త్వమే పరమ సత్యమైనచో దివ్యపరిణామము, దివ్యజీవితము అసత్యములై, విలువలేనివై ప్రాతిభాసికములగును.

కాని అన్నిటిని, మానవునియొక్క అనుభూతి ఆధారముగ నున్నది మనోమయసత్తా దివ్యసత్తనేవిధముగ కనుగొని యనుభూతి పొందునో,

ఆధ్యాత్మికానుభవముపై సర్వము ప్రతిష్ఠితమగును.

జగన్మిథ్యాతత్త్వములు, జగత్తును స్వప్నముతో పోల్చినవి. ఎటుల నిద్రతో నున్నప్పుడు స్వప్నము నిజముగకనబడి, మెలకువవచ్చిన తోడనే స్వప్నమసత్య మగునో అటులనే జగత్తులో నున్నంతవరకు అది నిజముగా దోచి, దానికావల బోయినపుడు జగత్తుఅనిత్యమని గోచరించును.

కాని ఈ ఉపమానము చెల్లదగినదికాదు. ఒకే చేతనమునుండి యిం కొక చేతనమునకు బోయినపుడు మొదటి చేతన మస్థిరముగ కనబడవచ్చును. కాని అందువల్లనే అది లేదని చెప్పుట సమంజసముకాదు. ఏలన ప్రత్యేక సత్యములుగల రెండు చేతనములుండవచ్చును. పృథ్వి అనిత్యముగా కనబడి నను, అది తాత్కాలికానుభవమనియు అందువలన, పృథ్వి అసత్యమని చెప్పుట సరికాదు. అదేవిధముగ జాగ్రదవస్థనుండి స్వప్నావస్థకు, దానినుండి నిద్రావస్థకు బోయినపుడు ఒకటి నిజము మిగిలినది అబద్ధమనిగాని, మొదటిది అబద్ధము, రెండవది, మూడవది అబద్ధమనిగాని చెప్పుటసరిగాదు జీవుడు మొదట అవస్థలోనున్నప్పుడు, అది నిజమని రెండవ మూడవ అవస్థలో నున్నప్పుడు, అదియు నిజమని యింతమాత్రము తెలును. ఒకదానిని అనిత్య మని త్రోసిపుచ్చి యింకొకదానిని సత్యమని చెప్పుట తర్కవిరుద్ధముగా నున్నది. జాగ్రదావస్థకు, స్వప్నావస్థకు, నిద్రావస్థకు యెంతో భేదమున్నది. ఏ యవస్థకు తగిన విధులు, గుణములు, రూపములు ఆ యవస్థకున్నవి. స్వప్నములు కొత్తిగా అబద్ధములుకావు. వీనియొక్క తత్త్వమును లోతుగా పరిశీలించినచో, వీని వాస్తవికత గోచరించును కాని సామాన్య మానవ చేతనకు కలలు భ్రాంతియుతముగ తోచవచ్చును.

నిద్రావస్థలో జాగ్రదావస్థనుండి విముక్తులమై, ఆంతరిక సత్యములను స్వప్నమూలమునను స్వప్నప్రతిమా రూపముల ద్వారమునను పొడగను చున్నాము సుషుప్తిలో చేతన నిగూఢముగ నుండి, జాగ్రదావస్థ, స్వప్నావస్థయొక్క అనుభవములేమియు లేకున్నను యిదియొక పరమ సుఖావస్థగ గణింపబడుచున్నది నిద్రావస్థ మిగత రెండవస్థలకు భిన్నముగా నున్నందున యిది భ్రాంతియుతమని దీనిని త్రోసివేయకూడదు.

జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల మూడింటినికూడ మాయాచేతన యొక్క సౌధములుగా పరిగణించి వీని కావలనున్న యునికిని అనగా కేవల సత్తను (Absolute reality) మాత్రమే సత్య వస్తువుగా ఎన్నుకోవచ్చును. కాని యీ మూడుస్థితులను ఒకే సత్యముయొక్క త్రివిధ స్వరూపములుగను త్రివిధ చేతనములుగను, త్రివిధ ప్రపంచానుభూతి, ఆత్మానుభూతులుగ కూడ నిర్ణయింపవచ్చును.

కలలు నిజస్థితిలో అనిత్యములైనను, అవి నిజ స్వరూపములయొక్క చిహ్నములుగా నున్నవి భౌతిక జగత్తును ప్రతిమా రూపముగను యింద్రియములద్వారా చూచుట నిజమే, కాని, యీ వస్తురూపముల వెనుక సంభోదింపబడియున్న చిహ్నములను మనము గ్రహించుచున్నాము. మనమొక చెట్టునో, రాతినో, జంతువునో చూచినపుడు మనము చూచునది, లేని రూపముకాదు, మతిభ్రమణము (Hallucination) కాదు. ఈ వస్తువులనే యితర సూక్ష్మేంద్రియములద్వారా మఱియొక విధముగ చూడవచ్చును. ఐనను వస్తువును న్యాయమని కనబఱచిన దొకటి ఇచటున్నది. కాని మాయావాదుల తత్త్వములో అనిర్వచనీయ నిరాకార శుద్ధ బ్రహ్మమొక్కటియే కేవల సత్యమనియు, ఈ శుద్ధ బ్రహ్మముయొక్క రూపము మార్పు నొందనదనియు,

పన్నబడుచున్నది. గనుక స్వప్న సాదృశ్య మిచట అన్వయించదు.

అటులనే మాయావాదుల తత్త్వమునకు మతివిభ్రమ సాదృశ్యము కూడ స్వప్న సాదృశ్యమువలనే సరిపోదు. మతివిభ్రమములు రెండు విధములు మానసికము, ఐంద్రికము. లేని వస్తువుల యాకారము మనము చూచినపుడు అది యింద్రియ దృష్టిలోపము, దృష్టి విభ్రమము నగును. అటులనే, ఆంత రిక స్వరూపమును దృశ్యమానముగ జూచితిమేని, అది మానసిక పొరపాటు, లేదా మతి విభ్రమము. ఎండమావులు మొదటిదానియొక్క ఉదాహరణము. రెండవదానియొక్క ఉదాహరణము రజ్జుసర్పభ్రాంతి. అటులనే సూక్ష్మ భౌతిక అనుభూతులు సహితము మతివిభ్రమములుగా భావింపవచ్చును. విశ్వ చేతనానుభూతి (Experience of Cosmic Consciousness) యీ తర గతిలో చేర్చబడి, మతివిభ్రమముగా అనుకొనబడుచున్నది

తత్త్వశాస్త్రములో దీని నధ్యారోపమందురు. అనగా ప్రత్యక్షముగా కనపడుదానిపై లేనివస్తువు నారోపించడమగును. నిజముగ కనపడు రజ్జువుపై సర్పభావము నారోపించుట, శూన్యఎడారిలో ఎండమావుల నారోపించుట యిం దులకు నిదర్శనములు. అటులనే, కేవల నిత్యవస్తువైన బ్రహ్మముపై వస్తు చయముతో కూడిన జగత్తు నారోపించడముకూడ ఒక మతివిభ్రమ మన వచ్చును. ఈ ఉదాహరణములలో లేనివస్తువు నారోపించుటకాదు. ప్రత్యక్షము గనున్న ఒక వస్తువుపై ఇంకొక వస్తువును, మనో విభ్రమము వలనగాని, యింద్రియ క్షోభము వలనగాని ఆరోపించడమగును. ఎండమావులు, పాము, యీరెండును వాస్తవ స్థితిలో మనకు తెలిసియున్న వస్తువులే. కాని ఒకదానిని చూచి యింకొక దానినిగా భ్రమించుట మనోవికల్పము వల్లనే యగును. కనుక, యీ యుదాహరణముల పోలిక సమంజసము కానేరదు. మనకు

ప్రత్యక్షముగా నగుపడు నటువంటి ప్రపంచమువలె యింకొక ప్రపంచము, మఱెక్కడనైన యుండి మనకు గోచరించు యీ ప్రపంచము. ఆ పరోక్ష ప్రపంచముయొక్క ప్రతిబింబమైనచో లేదా యీ ప్రపంచము, బ్రహ్మముయొక్క బూటకమైన సాంకేతిక ఆవిష్కార మైనచో యీ యుదాహరణములు సహాయకరమగును. కాని జగద్బ్రహ్మల ఉదాహరణములలో, సదానిరాకార బ్రహ్మముపై సదా సాకార ప్రపంచము నారోపింపబడుచున్నది. పట్టునేలపై రజ్జుసర్పములను, శూన్య ఎడారి గాలిలో ఎచటను లేనివస్తువులను నిర్మించినచో, మన దృష్టికి సరిఅయిన పోలిక సంభావ్యమగును.

ఒకదానికొకటి సంబంధములేని వస్తువులను ఒకదానిపై నింకొక దానిని ఆరోపించుట మతిభ్రమణకాని. మఱేమియుకాదు. నామరూప సంబంధములు లేని బ్రహ్మమును, నామరూప సంబంధములు కలిగిన జగత్తును యీ రెంటిని సత్యములుగానెంచి, ఒకదానిపై నొకటి నారోపించినపుడు, (అనగా రజ్జువుపై సర్పమును సర్పముపై రజ్జువును ఆరోపించినటుల) సగుణ బ్రహ్మముపై నిర్గుణ బ్రహ్మమును నారోపించినపుడు మతిభ్రమణ ఉదాహరణము చెల్లును. కాని యీ రెండును వాస్తవమైనచో యీ రెండును ఒకే సత్యముయొక్క భిన్నముఖములుగను, ఒకే యునికి యొక్క స్థిర, గతి, రూపద్వయములుగను సహకారులుగను, మనము తెలిసికొనవలెను. వీనిని గురించిన మనోవికలతగాని, తప్పిదముగాని, సత్యాన్వేషణయందు కలిగిన లోపమని భావింపవలయునుగాని, జగత్తు మిథ్యాసృష్టియని భావింపతగదు.

ముత్యపుచిప్ప వెండి దృష్టాంతముకూడ, రజ్జుసర్ప ఉదాహరణము వలెనే ప్రత్యక్ష సత్యముపై అపరోక్ష సత్యమును ఆరోపించుటచే, కలిగిన మనో విభ్రమమగును. ఒక చంద్రునికి బదులు రెండు చంద్రులను చూచినపుడు అదికూడ దృష్టిలోపమగును.

మనమెల్లడల ఒకే సత్యమును ఏకముగను, అనేక శక్త్యాకారములు గల బహుత్వ సత్యముగా పరిణమించుటను గాంచుచున్నాము. ఈ పరిణామ విధానము మహత్తర వింతయగు ఇంద్రజాలముగ కనపడవచ్చును. కాని, యిది అనిత్యముయొక్క యింద్రజాలమనియు, కేవల సత్యముయొక్క విజ్ఞానముచే చిత్‌శక్తి విధానము వలన కలిగినది కాదనియు సనాతన ఆత్మజ్ఞానముచే నడిపింపబడిన స్వయం సృష్టికాదనియు మనము నిరూపింపజాలము.

ఇప్పుడు మనము సర్వభ్రాంతులకు మూలమైన మనస్సును గుఱించి విచారింపవలసియున్నది. మనస్సు ఒకానొక భ్రాంతియొక్క ఉపకరణమా? సంతానమా? లేదా ప్రథమ అపర స్రష్టశక్తియా లేక చేతనమా? లేక మానసిక అజ్ఞానము, సత్తయొక్క యదార్థములను అపార్థము చేసుకొను చెఱసాలయా? లేదా, సత్య ప్రపంచమునకు సృష్టికర్తయైన ఋతుచేతనయొక్క అతిక్రమమా? మన మనస్సు చేతనయొక్క ప్రథమము, ముఖ్యమైన సృష్ట్యాత్మకశక్తి కాదు. మనమనస్సు, సమస్త మనస్సున్ను మధ్య రంగములోనుత్పన్నమైన సృష్టికర్తలు, ప్రభువులు. మన మనస్సు, ఊర్ధ్వచేతనము, నిశ్చేతనము మధ్యయందు నిలుచుకొని, యీరెంటి వ్యతిరేక భూమికలనుండి గ్రహించుచున్నది. అది ఆంతరిక రహస్యమైన యునికికిని, బాహ్యవిశ్వములో కనబడు వస్తువుల నడుమను నిలుచుకొనియున్నది. అది జ్ఞానమునకు కర్మకు కావలసిన స్వతఃస్ఫురణములను, ఆవేశములను, కల్పనలను ప్రేరణలను భావసత్యములయొక్క చిహ్నములను ఆంతరిక, అవిదిత సంభావ్యములను గ్రహించుచున్నది.

అభివ్యక్తమైన వాస్తవికతలను, విశ్వ వస్తువులలో ఆవిర్భవింపనున్న సంభావ్యముల సూచనలను సహితము అది గ్రహించుచున్నది. అది ప్రధానము సంభావ్యము లేదా వాస్తవమునగు (essential, possible or

actual) సత్యములను గ్రహించుచున్నది వ్యక్తమునుండి అవ్యక్త సంభావ్యముల నూహించి, వానినుండి లబ్ధమగు స్పష్టతలను ఉపలబ్ధినొందును. అటులనే; అవ్యక్తము నుండియు, అంతరికము నుండియు; ఆవేశములను గ్రహించి; వాని సంభావ్యముల నూహించి, వాని నుపలబ్ధిపొందుటకు ప్రయత్నించును మన మనస్సు స్పష్టతలను కనుగొనుచు, ఉపయోగించుచూ; తెలియని సత్యములన్వేషించి గ్రహించుచూ సత్యప్రధానమునకు: స్పష్టతలకు మధ్యయందు నిలుచుకొని సంభావ్యములలో వ్యాపారము చేయును. కాని అనంత చేతనమునకు గల సర్వజ్ఞత మనస్సునకులేదు. మనస్సు పరిమిత జ్ఞానము కలదై తన పరిమిత జ్ఞానమును కల్పనా వివేచనలతో పరిపూర్ణమొనర్పవలసియున్నది. అనంత చేతనవలె మనస్సు తెలిసిన దానిని అభివ్యక్తపరచదు.

అది తెలియని దానిని కనుగొనవలసి వచ్చును. అనంతముయొక్క సాధ్యతలను; గుప్తసత్యముయొక్క ఫలితములుగను లేదా స్వరూప భేదములుగను గాక అది తన అపారమైన కల్పితముయొక్క కట్టడములను, సృజనములను కట్టుకథలుగా పట్టుకొనును. మనస్సునకు అనంత చేతనాశక్తియొక్క సర్వశక్తిత్వములేదు. కాని విశ్వశక్తి దానికేది యిచ్చునో దానిని సఫలముజేసి అభివ్యక్తపరచును. పరిమిత విజ్ఞానము కలదై అది తప్పునకు అవిద్యకు గుఱియగుచున్నది. వాస్తవములతో పనిచేయునపుడు మనస్సు సక్రమముగా చూడకను, దుర్వినియోగముచేసి కుసృష్టికి ఎఱగావచ్చును. సాధ్యతలతో పనిచేయునపుడు అది తప్పుగా కూర్చి; తప్పుగాచేర్చి తప్పుగా ఉపయోగించి నియమిత స్థానమును తప్పించును. వెల్లడింపబడిన సత్యములతో పనిచేయునపుడు వానిని విరూపములుగను, తప్పులుగను తెలియజేసి పొందిక లేనివిగజేయును.

మనస్సు సృష్టించినను, అది శక్తివంతము సర్వజ్ఞతతో కూడిన సృష్టికాదు. పదార్థమున కనువగుదానిని పదార్థమునుండి మనస్సు సృష్టించును అటులనే అది ప్రకృతి శక్తి కనువగు శక్తులను ఆమెనుండి గ్రహించి వానితో పనిచేయును.

మనస్సునకు కల్పనాశక్తి కలదు. అది తన కల్పనలనే, నిజముగనో, అబద్ధముగనో జూచును నిజస్థితిలో కల్పనలన్నియు, సంభావ్యములకు చిహ్నములుగ నున్నవి. కొన్ని కల్పనలు, ఏదో యొకనాడు, నిజమైన రూపము దాల్చవచ్చును. కొన్ని సమకాలిక సృష్టిలో నిజరూపము దాల్చక పోవచ్చును. కొన్ని అనుకొన్న రూపమునగాక వేరురూపములో ప్రత్యక్షము గావచ్చును. కనుక మనోకల్పితములు బొత్తిగ మిధ్యాజన్యములు.మాయయుకావు మనోకల్పితములు అనంతముయొక్క "కాబోవునవియో కాదగినవి" గనో రూపముదాల్చి ప్రకటితము గావచ్చును. మనస్సు నాగకన్యకా రూపమును కల్పించును ఇది రెండు ప్రత్యక్ష వస్తువుల సమ్మేళనమై, ప్రస్తుత పృధ్వియొక్క సామాన్య స్థితికి భిన్నముగనున్నను, యీ స్వరూపము సంభావ్యమే.

ఇదే విధముగా 'దేవదూతలు', 'సింహముతల, పాముతోకగల మేక' 'రాబందు తల, రెక్కలు కలిగి సింహశరీరముగల జంతువు' ఇటువంటి విచిత్ర వస్తువులను మనస్సు కల్పనచేసినది. ఇది పూర్వసృష్టిలో నిజముగా నుండిన స్మృతి చిహ్నములు కావచ్చును. లేదా ఇవి రాబోవు సృష్టిలో సాధ్యములుగనో, లేక యింకొక లోకములో యదార్థముగ నుండునవిగనో కావచ్చును, అటులనే వెఱ్ఱివానియొక్క విపరీత కోరికలు కావచ్చును, పై సమీక్షవలన రెండు సాధ్యములు మనకు గోచరమగుచున్నవి. మొదటిది

భ్రమలు, అనిత్యతలు కలిగి, మానవ జంతుచేతనములలో మనస్సు నుపకర ణముగాగల ఒక యాదిమ చైతన్య శక్తియున్నట్లూహింపవచ్చును ఇందు వలన బహువిధములుగా కనబడు ప్రపంచము అనిత్యమై, మాయాకల్పనయై భేదరహితము, అనిర్దేశ్యమునగు కైవల్యము మాత్రమే సత్యమగుచున్నది లేదా రెండవది యదార్థమైన జగత్తును సృష్టించు ఒక ఆదిమ పరమ సత్య చేతన యున్నట్లుగను అందులో మనస్సు ఒక అసంపూర్ణ చైతన్యముతో నున్నదిగను భావింపవచ్చును. మన సమీక్ష యీ రెండవ సాధ్యము వైపు నకు గొనివచ్చినది గనుక జగన్మిథ్యా దృష్టి మన సమస్యయొక్క చిక్కును విడదీయజాలదు. నిత్యమైన సత్యములో మహావింతగానుండు ఒకానొక మూల మాయాశక్తిని ప్రతిపాదింప నవసరములేదు లేదా సనాతనముగ పరి శుద్ధముగను శాశ్వతముగను, కేవలముగనుండు చైతన్యములో శూన్యమైన రూపములు కలిగిన ప్రపంచము నారోపింప నవసరములేదు.

## బ్రహ్మము – మాయాప్రపంచము

బ్రహ్మసత్యమ్ . జగన్మిథ్యా : వివేక చూడామణి

20 శ్లోకము

మాయీప్రభువు, తన మాయచే యీ ప్రపంచమును సృజించును. అందులో జీవుడు బంధితుడైనాడు. మాయను ప్రకృతిగను, మాయా ప్రభు వును సమస్తమున కీశ్వరుడైన మహేశ్వరునిగను తెలిసికొనవలెను.

శ్వేతాశ్వతరోపనిషత్తు, IV 9, 10

సర్వము దివ్యసత్తయే.

భగవద్గీత, VII: 19

ఇచట నున్నదంతయు పురుషుడే. యిదివరకుండినదియు, యికముం దుండ బోవునదియు నతడే. ఆయన అమృతత్వమునకు ప్రభువు: అన్నము వలన వృద్ధిబొందునదంతయు ఆయనే.

శ్వేతాశ్వతరోపనిషత్తు, III: 1 5

మన విచారణా క్షేత్రములో ముందటి నేలను కొంతవరకు శుద్ధిపఱచితిమి. కాని రుజువు చేయవలసిన విషయమింకను వెనుకటి భాగములో నున్నదీ. అదేమన, ఈ ప్రపంచమును సృజించి వెలువరించిన మొదటి చైతన్యము లేక శక్తియొక్క స్వభావమును గురించియు, దానికిని మనకును గల ప్రపంచ సంబంధమును గురించియు తెలిసికొనవలసిన విషయము. అనగా ప్రపంచము, చేతనయొక్క కల్పనయై ఒకానొక మాయాశక్తిచే మన మనస్సుపై నారోపించబడినదా లేక మనము అజ్ఞాన దశయందున్నను జ్ఞాన ప్రగతిలో అనుభవమగు సత్తయొక్క యదార్థ స్వరూపమా ?

మానసిక గ్రహణమంతయు. త్రిమూలబద్ధమై ద్రష్ట దర్శన దృశ్యము అనెడి వానిపై నాధారపడియున్నది. వానిని ప్రత్యేకించి ఒకటొకటియు, యదార్థమనిగాని, అనిత్యమనిగాని ప్రవచింపవచ్చును. వానిలో ఏది ఎంతవరకు, ఏ విధముగ నిజమనునదే ప్రశ్న. వానినన్నిటిని, మాయా స్వరూపములుగా విసర్జించినచో, యింకొక ప్రశ్న పొడమును. అదేమన, వానికావల యొక సత్యమున్నదా? అట్లయినచో, సత్యమునకు, మాయకునుగల సంబంధమేమి?

మనకు కనబడుదానిని, అనగా దృశ్య ప్రపంచమును నిజమనియు

గ్రహణశక్తి గలదానిని అనగా దృక్ పదార్ధమును, వ్యక్తిని, అబద్ధమనియో లేక యీ దృక్ చేతనాశక్తియొక్క యదార్థమును తగ్గించియో, మనము ప్రవచించుటకు వీలగును. జడపదార్ధ యదార్థవాదతత్త్వములో, చేతన అనునది జడములోగల జడశక్తియనియు, మస్తిష్క కణముల స్పందనమనియు, జడసంస్పర్శలచే జడమునకు గలిగిన ప్రతిక్రియ యనియు, గ్రహించువాడు అనగా ద్రష్ట, యాంత్రిక ప్రతిక్రియలు గలిగి, శరీరము మెదడుగల చేతనాభిదానమనియు తలంపబడుచున్నది. కాని ఆధునిక కాలములో నిరూపితమైనట్లు జడము, ప్రాణశక్తి ప్రకారమో లేక ప్రాణశక్తియే యైనచో (Energy) అప్పుడు కేవల జడము యదార్థముగాక, ప్రాణశక్తి మాత్రమే యనుట యదార్థమగును. అప్పుడు ద్రష్ట, దర్శన, దృశ్యము (The percipient perception, the perceived) యివన్నియు ప్రాణశక్తియొక్క ప్రకారములగును. కాని సత్తాలేని ప్రాణశక్తియు చైతన్యములేని ప్రాణశక్తియు, శూన్యములో పనిచేయు ప్రాణశక్తియై, యివికూడ అబద్ధముగ కనబడును' లేదా యీ ప్రాణశక్తి యొకానొక తాత్కాలిక చలనమై, యిది యెప్పుడైనను వస్తువులను సృష్టించుటను ఆపివేయవచ్చును. అప్పుడు అనంతముయొక్క శూన్యమే శాశ్వతము, యదార్థమునగును. బౌద్ధతత్వముకూడ యీ నిర్ణయమునకే వచ్చినది బౌద్ధుల ప్రకారము దృక్, దృశ్య, జ్ఞానములు కర్మ సంస్కార జనితములు అందువలన కేవల సత్యమునుకూడ వారు శూన్యము లేక నిర్వాణము లేక అసత్తుగ నిర్ణయించిరి,

ఇచ్చట పనిచేయునది ప్రాణశక్తిగాక ఒక చైతన్యమని భావింపవచ్చును. జడమును ప్రాణశక్తియేయని నిరూపించినపుడు ప్రాణశక్తిని చైతన్యమని నిరూపింపనగును. కాని యీ చైతన్యము సహితము శూన్యములో పనిచేయునని ఊహించినపుడు, యీచైతన్యముకూడ అనిత్యమనియు

తాత్కాలిక మాయావస్తువులను సృజించునదనియు నిరూపితమగును. అపుడు చైతన్యమును మనము శూన్యము అనంతమైన పూజ్యము అను నిగమము నకు రావలసివచ్చును. కాని యీ నిగమములు క్రమబద్ధములుకావు. ఏలనన యీ చైతన్యము వెనుక ఒకానొక అగోచరమైన యునికి యుండవచ్చును. అప్పుడు ఆ యునికియొక్క చైతన్యశక్తి యదార్థమగును. ఈ చేతనచేసత్తా యొక్క అనంత సూక్ష్మపదార్థమునుండి సృజింపబడినదై, యింద్రియముల కగోచరమై వానికి ప్రాణశక్తి క్రియచే ఒకానొక దశలో జడముగా విదిత మైన నిర్మాణములు సహితము యదార్థములగును. అటులనే ప్రథమ సత్తా నుండి చైతన్యసత్తాగా భౌతిక జగత్తులో బయటకువచ్చు వ్యష్టి(Individual) కూడ యదార్థమగును. ఈ ప్రథమసత్త విశ్వమయ ఆధ్యాత్మిక యునికయై యుండవచ్చును. లేదా యితర అంతస్తు కలిగియుండవచ్చును. కాని యెట్టి స్థితిలోనైనను మాయాజగత్తులో కేవలదృగ్విషయవస్తువులు మాత్రముండవు

సాంప్రదాయిక మాయాతత్వ సిద్ధాంతములో కేవల పరమ ఆధ్యాత్మిక సత్తామాత్రమే ఒకే సత్యముగ పరిగణింపబడుచున్నది దాని ప్రధానాంశముచే అది ఆత్మయనను. యీ ఆత్మకు సంబంధించిన ప్రకృతి సత్తాలు తాత్కాలిక ఆభాసములు. దాని కేవలత్వములో అన్నివస్తువులకు మూలమదియే. ఈ ఆధారముపై నిర్మింపబడిన జగత్తు అనిత్యమో, ఒక పోలికయో లేదా ఒకా నొక విధముగా అనిత్యమైన నిత్యమోయగును. అదియొక విశ్వమయభ్రాంతి.

పరమసత్త "ఏకమేవాద్వితీయమ్", అది ఒకటితప్ప మరేమియులేదు. ఈ సత్తకు యదార్థమైన సంభూతములులేవు. అది యెప్పటికిని దేశకాల నిమిత్తముల కతీతమై, సదా నిర్వికారమైయుండును. అది చైతన్యము కలిగి యుండినచో, ఆ చైతన్యము దానియొక్క కేవలసత్తకు సంబంధించిన విశుద్ధ

చేతనయై యుండవలయును. కాని మాయ యనునది ఎట్టి మహిమ వలన లేక పరమ రహస్యము వలన సంభవమైనది? కాలములో ఆ మాయ ఎట్లు సంభవించినది? అది ఎల్లపుడుండుట కెటుల సాధ్యమైనది?

బ్రహ్మము మాత్రము యదార్థమైనందున బ్రహ్మముయొక్క చేతనయో లేదా బ్రహ్మముయొక్క శక్తియో, యదార్థమైన సృష్టికర్తగను, యదార్థములను సృష్టిచేయునదిగ నున్నది. కాని కేవల పరిశుద్ధ బ్రహ్మమే సత్యమైనందున బ్రహ్మమునకు యదార్ధమైన సృజనశక్తి వుండనేరదు. రూపనామకాలములనీను బ్రహ్మము సంభూతిని సూచించుచూ, తద్వారా జగత్తును ప్రతిష్ఠించుటచే సంభూతిని యదార్ధము కాదను అనుభూతికి యిది వ్యతిరేకముగ నున్నది. ఇది "ఏకమేవాద్వితీయమ్" అను సూక్తమునకు భిన్నముగనుండి మాయాసృష్టి యగుచున్నది. అందువలన మాయ నిజముకాదు. మాయ సహితము భ్రమయై లెక్కలేని భ్రమలకు మూలమగుచున్నది కాని యీమాయయు దాని పనులును వ్యక్తిత్వము గలవిగుటచే యివి ఒక విధముగ నిజముగా నున్నవి. ఇంకనేమన, జగత్తు శూన్యములో స్థాపితము కాలేదు. ఇది ఒక విధముగా సత్తపైన నారోపింపబడినది మాయలోనుండు మనము దాని రూపనామ క్రియలను బ్రహ్మసంబంధములని చెప్పుచూ యివన్నియు బ్రహ్మముగా ఎఱుకగలవారమై సత్తను అసత్యములద్వారా కనుగొనుచున్నాము. అందుచే మాయలో యదార్ధత యున్నది. మాయ ఒకేకాలములో సదసత్తులుగ నున్నది. అది కలదు, లేదు. అది సత్యముకాదు. అసత్యముకాదు. అది విచారమునకు మించిన గూఢ ప్రశ్నగను, విపరీతమైన వింతగనున్నది. కాని యీ నిగూఢ రహస్యమేమి? ఇది అపరిష్కృతమా? బ్రహ్మసత్తలో యీమాయ ఎట్లు మధ్యన వచ్చినది? ఈ మాయ యొక్క అసత్యా సత్య స్వభావమేమి?

తొలిచూపులో బ్రహ్మమే మాయను ఏదోయొక విధముగా గ్రహించు నదిగా అనుకొనవలసియున్నది. ఏలన బ్రహ్మ యొకటియే యదార్థమైనందున బ్రహ్మము గ్రహించునది కాకపోయినచో మాయను గ్రహించునదెవరు? గ్రహించువారింకొక రెవరును లేరు మనలో సాక్షీభూతముగ నుండు వ్యక్తి మాయాజనితమై అసత్యముగ నున్నాడు కాని బ్రహ్మము గ్రహించునదైనచో పరిశుద్ధమైన ఆ సత్తలో పరిశుద్ధమునే చూచు ఆ యదార్థములో భ్రమ. స్వభావము గల మాయ ఏ విధముగ క్షణికముగనైన నుండగలదు? జగత్తును వస్తువులను సత్యచేతనతో బ్రహ్మము చూచినపుడు, అవన్నియు సత్యమై తానే అయియుండవలెను. కాని అవి పరిశుద్ధ సత్త కానందునను అవి ఉత్తమ దృష్టిలో దాని ఆకారములైనందునను జగత్తుయొక్క యదార్థసత్యత పరిష్కృతి కానేరదు. ఐనను తాత్కాలికముగనైన జగత్తు సత్యమని మన మనవలెను. ఈ అధారముపైన మనకుకలిగిన చిక్కునెదిరించి విడదీయవలెను.

మాయ ఒక విధముగా యుదార్థమైనచో సత్యబ్రహ్మము మాయను గ్రహించెడిదిగా నున్నది. మాయ సత్యబ్రహ్మముయొక్క భేదపరచు జ్ఞాన శక్తికానోపును. భేదముగల సృష్టి మాయయొక్క ఫలితమనియు, మాయాశక్తియొక్క సారము కాదని తలచినను తుదకది బ్రహ్మచేతనము యొక్క కొంతశక్తియై యుండవలెను. ఎందుకన చైతన్యము మాత్రమే కనుగొను శక్తికలిగినదైనందున మాయను సృష్టించగలదు. బ్రహ్మముకంటె వేరైన యింకొక ప్రథమ సృజన చైతన్యముండనేరదు. కాని బ్రహ్మము ఎల్లప్పటి కిని తనకుతానే ఎఱుక గలదై యున్నందున బ్రహ్మచైతన్యములో రెండవస్థ లుండవలెను. ఒకటి కేవల సత్తయొక్క యదార్థత నెఱుగునదియు; రెండవది, తానే ఒక విధమైన యదార్థత నాపాదించి, యదార్థము కానివాని నెఱుగు నదియు. ఈ యదార్థములు కానివి సత్యముయొక్క పదార్థమునుండి చేయ

బడినవి కావు. అట్లయినచో, అవికూడ యధార్థములు గావలయును ఈ దృష్టిలో జగత్తు పరమ సత్తనుండి సృజింపబడినదని చెప్పు ఉపనిషద్వాక్యములు అగ్రాహ్యములు; బ్రహ్మము ప్రపంచమున కుపాదానము కానేరదు. మన ప్రకృతి ఆధ్యాత్మిక సత్తాతో చేయబడినదికాదు అది మాయయొక్క అనిత్య సత్యముతో చేయబడినది. కాని మన ఆధ్యాత్మిక సత్తా బ్రహ్మపదార్థముతో చేయబడి, బ్రహ్మమైయున్నది. బ్రహ్మము మాయాతీతము. కాని బ్రహ్మము తన సృష్టిని పైనుండియు, మాయనుండియు గ్రహించునదిగా నున్నది. యదార్థ నిత్యగ్రహణశక్తి గలదానికిని, అనిత్యముగా గోచరమైన దానికిని అనిత్యముగా గోచరములైన వానియొక్క అర్ధసత్యముల సృష్టికర్తయైన జ్ఞానము అను నీ కఠిన ప్రహేళిక (riddle) యుక్తమగు ఒకే సమాధానము ఈ ద్వైత చైతన్యమే (Dual Consciousness). ఈ ద్వైత చైతన్యమే లేక మాయ మాత్రమే బ్రహ్మముయొక్క చేతనాశక్తి యైనచో యీ క్రింది రెండింటిలో ఒకటి నిజము కావలెను.

బ్రహ్మచైతన్యము యొక్క ఊర్ధ్వ చేతనా నిశ్చలత, అచలత వాని నుండి సంభవించు ఆంతరిక క్రియాకలాపమై, బ్రహ్మచేతనాంశము నుండి సంభవించి, అందువలన యదార్థముగా కనబడు అనుభూతులద్వారా నడుచు నట్లును బ్రహ్మ సత్తాగుండా అనుభూతులు కలుగనందున అవి అసత్యములుగా నున్నట్లును మాయాశక్తి గోచరించుట యనునది ఇదొకటి లేదా మాయ అనునది బ్రహ్మసత్తాలో నిత్యముగనుండు ఆయనయొక్క విశ్వాత్మక భావనా శక్తియై శూన్యమునుండి అనిత్యమగు నామరూప సంఘటనలు సృష్టించునదిగ కనబడుట: అట్లగుచో మాయ యదార్థమై, దాని క్రియలన్నియు భౌత్తిగా కల్పనమై. కేవలము భ్రాంతియుతము లగును. కాని మనము నిత్యసత్తకు "ఊహ" మాత్రమే సృజనాత్మక శక్తిగను, గతిరూపక శక్తిగను నిరూపించ

గలమా ? అవిద్యా చేతనాయుతమైన సాక్షిక సత్తాకు ఊహ యొక ఆవశ్య కతయే. ఎందుకన అది తన అవిద్యను ఊహాపోహాలతో పరిపూర్తి చేసికొన వలెను. కాని కేవల నిత్యము పరిపూర్ణమునైన సత్తాలో యిటువంటి అనిత్య సంఘటనలకు తావులేదు అఖండమై నిత్యసత్యానందములతో నోలలాడు పరమసత్త తనలో అనిత్యమైన దేశకాలములను సృజించి సర్వదా అబద్ధపు వస్తురూప సంఘటనలతో విశ్వమంతటినీ నింపి, యీ బూటకపు నటన ఆడ వలసిన ప్రమేయము కనబడదు. గనుక తర్కరీత్యా యీ పరిష్కృతి చెల్ల తగినదిగాదు

ఇంకొక పరిష్కారము: మాయ కేవల అంతరిక అనిత్య సత్త అను భావము జడ, ప్రకృతిలో బాహ్యాంతర అనుభూతులమధ్య మనస్సుచేసిన భేద ములనుండి ఆరంభమగును ఎందుకన స్థూలదృష్టి కగపడు బాహ్యమును మాత్రమే ఇది నిజమనును. కాని బ్రహ్మచేతనలో యీ భేదభావ ముండుటకు వీలుకాదు. అచట దృక్-దృశ్యములు రెండును లేక కేవల బ్రహ్మము మాత్రమే తన చైతన్యముయొక్క ద్రష్టగా నున్నది. బ్రహ్మమునకు తాను మాత్రమున్నందున బాహ్యమున చూడవలసిన దేదియుకూడ లేదు గనుక చేతనయొక్క అంతరిక క్రియ నిజమైన వస్తువులనుగాక కల్పనా 'వస్తువులను సృజించడమనేది సత్య బ్రహ్మముపై అపరిశుద్ధ మనసు చేసిన ఆరోపణ యగును. బ్రహ్మసత్తయును, బ్రహ్మచైతన్యమును రెండు వేర్వేరు తత్త్వ ములు కానందున వీనికి భేదమాపాదించి సచ్చేతనము, సత్పదార్ధముపై తన అనుభూతుల నారోపించి, తాను సత్పదార్ధమును మాత్రము స్పర్శింపను ప్రవే శింపను మార్పు కలుగజేయను వీలుగాని దానిగ నిర్ణయించడము సరిగాదు.

కనుక బ్రహ్మము కేవల స్వయంసత్తగనో లేదా మాయనుండి సద సత్తయిన వ్యక్తియొక్క ఆత్మగనో తన చైతన్యముచే తనపై ఆరోపింప

బడిన భ్రమణములను తెలిసికొనగలదు. మాయలోనుండు ఏదోయొకశక్తియో దానిలోనుండు ఏదో కొంతమాత్రమో దానియొక్క కల్పనలవల్ల భ్రమించును లేదా నిజముగ భ్రమణమొందక పోయినను భ్రమించునట్లుగా ప్రవర్తించును. ప్రకృతి క్రియలనుండి మన చేతన అవిద్యలో వేరై తనలో ఆత్మయొకదానినే సత్యముగను, మిగతదానిని అనాత్మగను అసత్యముగను ఎఱిగినపుడు మన చైతన్యములో యీ ద్వైతము సంభవించును.

ఈ పరిష్కారము కేవల అఖండ పరిశుద్ధ సత్తను కాదనును. దాని ఏకత్వములో ద్వైతమును కల్పించి సాంఖ్యశాస్త్రములోవలె పురుషప్రకృతులకు ద్వైత తత్త్వముపపాదించును ఈ పరిష్కృతుల నన్నిటిని త్రోసిపుచ్చవలసినదే.

మన ప్రపంచములో నున్నటుల బ్రహ్మములో చేతనద్వయము విద్యావిద్యలు వున్నవని భావించుట తప్పు. బ్రహ్మము మాయకులోనై యుండునని చెప్పినచో సత్తను అజ్ఞానము ఆవరించినదని చెప్పవలసివచ్చును. నిత్యసత్యమునకు మన చేతనా పరిమితుల నారోపించుటచే సత్తయొక్క యదార్థమునకు అఖండ నిర్మలత్వమునకు భంగము కలుగును

చేతనయొక్క అధీనతా క్రియాఫలితముగ, జగదభివ్యక్తియందు ద్వైవపద్ధతి కనుగుణముగ సంభవించినట్టి అవిద్యను తలప శక్యమగును. కాని నిత్యసత్తయొక్క ప్రథమ చేతనలో శాశ్వతముగా నుండు అర్థహీనమైన అవిద్యను, మాయను తలప శక్యముకాదు.

కొందరి తత్వరీత్యా జగమే లేదనియు, మాయ యదార్థము కాదనియు

బ్రహ్మమొక్కటే సత్యమని చెప్పుదురు. కాని యిట్లు చెప్పుటచే మన చిక్కు పరిష్కృతముకాదు

యదార్థమైన జగములేనిచో విశ్వమయమాయ మాత్రమున్నచో, యీ మాయ యెట్లు సంభవించినది? దీనికిని బ్రహ్మ సత్తకుగల సంబంధమేమి? యనియు, మనకు మాయతోగల సంబంధమేమి యను ప్రశ్నలు పొడసూపును. ఈ దృష్టిలో, మాయ బ్రహ్మచైతన్యముయొక్క శక్తిగాదనియు బ్రహ్మము మాయను, ఆమె క్రియలను గ్రహించు వాడుకాదనియు, మనమనుకొనవలసి వచ్చును బ్రహ్మము తన కేవలత్వములో యుండియూ, అతీత చైతన్యము గలదై మాయతో సంబంధము లేదనవలెను. అట్టితరి, మాయ భ్రాంతిగా కూడ యుండనేరదు, లేదా ద్వైతసత్తయే, రెండు సత్యములలో నుండి, ఒకటి నిత్యమైన అతీతము. రెండవది ఒక అనిత్యజగమును సృష్టించి; అనిత్య జగము వెలుగు మిథ్యాశక్తిగ నుండవలయును. ఇటువంటి క్లిష్టపరి స్థితులలో సర్వవేదాంత తత్త్వము మాయాంశికమనియు, తత్త్వమంతయు విభ్రమమనియు చిక్కులు విడదీయుట సాధ్యము కాదనియు తూష్ణీభావము జెందవలసి వచ్చును.

మన కెదురగునది అఖండ పరిశుద్ధ నిత్యసత్తయు, దీనికి విరుద్ధముగ యదార్థతలేని అనిత్యజగము. వాని పరస్పర సంబంధము కనుగొనవలసి యున్నది. ఒక తత్త్వ దృష్టిలో గ్రహించెడు వ్యక్తి గ్రహింపబడు జగము నిత్యములై బ్రహ్మపై నారోపింపబడుటచే, మాయకొక యదార్థత గలుగు ననియు, యీ యదార్థత జీవికికూడ కలిగి, యీ మాయకులోబడి జగములో నున్నంతవరకు, జగమున్నంతవరకు, యిది యుండునని చెప్పబడినది. కాని అనిత్యమైన సత్తా, సత్యతను ధరించనేరక, యదార్థ బంధమును గాని,

ముక్తినిగాని యనుభవించను వీలుపడదు అప్పటికికూడ బ్రహ్మములో లేనిచో, ఈ మాయ యెక్కడనుండి వచ్చును ? ఈ తర్క ప్రవాహముమరల బ్రమ్మముయొక్క ద్వైతసత్తా చైతన్యములకు మనలను తీసికొనిపోవుచున్నది అనగా మాయలో నిమగ్నమై నటువంటిన్ని మాయనుండి విముక్తి నంది నటువంటిన్ని ద్వైత బ్రహ్మచేతనము, ద్వైత బ్రహ్మ సత్తయు. మఱియు మాయకుగల యొకవిధమైన యదార్థత, యివి స్పష్టమగుచున్నవి. మనయుని కికిని-జగమునకును యదార్థతలేనిచో, మనజీవితయునికి సమస్యకు పరిష్కృతి యేలేదు కాని ఆధారములేని, ఆదిమ విశ్వమయ- మాయయొక్క సత్య మేమైయుండనగును ? ఇదియొక యనిర్వచనీయమైన విచారణ కతీతమైన రహస్యము,

ఈ క్లేశములు కలిగించు విషయమునకు సమాధానము కనుగొనవలసి యున్నది. జగము కేవల మసత్యమను భావమును మనము తొలగించినచో యొక రాజీకుదురును. ఉపనిషత్తులలో బ్రహ్మము నాల్గవస్థలలో నున్నదని ప్రవచింపబడినది. ఈ కనబడునదంతయు కూడ బ్రహ్మమని జెప్పబడినది. తన్నుతాను నాల్గవస్థలలో బ్రహ్మము జూచుచున్నది. మొదటిదగు తురీయావ స్థలో బ్రహ్మము స్వసత్తలో లీనమై. స్వచేతనానందములలో నిమగ్నమై అన్నిటిని కలిగియుండి దేనిలోను అంతర్నిహితము గాకయున్నది. జగము నకు మూలమైన సుషుప్త్యవస్థలో బ్రహ్మము ఘనీభవించిన చేతనము కలిగి, సర్వశక్తి కలిగినదై బీజస్థితిలో, కారణసత్త గలిగియున్నది. దీనినుండియే జగదావిష్కారము కలుగుచున్నది. సూక్ష్మము, అధిభౌతికము, అంతరికము నగు అనుభూతులు కలిగిన స్వప్నావస్థయు భౌతికానుభూతికి ఆశ్రయముగ నుండు జాగ్రదావస్థయు యీ రెండును, బ్రహ్మముయొక్క అవస్థలే, ఈ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూడున్ను మాయకు క్షేత్రములుగ నిరూపింప

వచ్చును. గాఢనిద్రలో నున్నజీవుడు స్వప్నావస్థకు జరిగి, అచట అనిత్యమైన నామరూప సంఘటనల ననుభవించి, జాగ్రదావస్థకు వచ్చినపుడు, యింకను, స్థిరమైన భౌతిక చేతనావస్తువుల ననుభవించినటుల పరమసత్తా తన ఘనీభూత మైన చైతన్యమునుండి, ఆంతరిక దృశ్యమాన అనుభూతులను, స్థితులను విస్తరింప జేయుచున్నది ఈ జాగ్రదవస్థ ప్రథమ కారణ నిద్రనుండి వచ్చిన యదార్థ జాగృతకాదు. ఆంతరిక స్వప్నావస్థకు సంబంధించిన వస్తుచయ అనుభూతికి విరుద్ధముగ, స్థూలముగ బహిర్గతమై చేతనయొక్క గతిరూప ములో వస్తుచయముగా నావిష్కరించి ప్రసన్నమైనదే జాగ్రదావస్థ. నిజమైన జాగ్రదావస్థ బహిరంత రానుభవములకును, జాగ్రత్స్వప్నములకును, వీని కన్నిటికిని కారణభూతమైన సుషుప్తికిని అతీతముగనుండు తురీయావస్థయైన పరాత్పర చేతనయే।

సర్వచేతనము, సకల అచేతనము అంతయుకూడ మాయయే। మాయ పరమ సత్తయొక్క ఆత్మానుభూతియైనందునను, ఆత్మసత్త కొంతదానిలో ప్రవేశించినందునను, అది నిజమే కాని అది నిద్రావస్థ, స్వప్నావస్థ వీని ఫలితములగు మిథ్యా జగత్తుతో నావిష్కరించిన జాగ్రదావస్థ వీనిని కలిగి యున్నందునను, కేవల సత్యమైన తురీయావస్థ కానందునను, మాయఅసత్య మగును. ఇచట సత్తాయొక్క వాస్తవమైన విభజనలేక సత్తాయొక్క వివిధ అవస్థాత్రయమున్నది. ఇచట ప్రధాన ద్వైతచైతన్యము, అసత్తునుండి యభి వ్యక్తముగాని మిథ్యావస్తువులను సృజించు ఇచ్ఛయులేవు. ఇచట ఒకేసత్తా పరాపర చేతనల రెంటిని కలిగి, యీ నాల్గవస్థలకు గల స్వభావానుభూతులతో నున్నది. కాని యీ కించిద్ యవస్థలు యదార్థత కలిగియున్నను అవి అవాం తర సౌధములు కలిగినవై పరమ సత్యములు కానేరవు ఒకే పరమాత్మ తన్నుతా ననేకముగ జూచును. ఆధ్యాత్మచేతన తానే యుపాదానముగా నిర్మిం

చిన సృష్టి. యీ ప్రపంచము. ఈ నానాత్వముకూడ ఆంతరికమై యున్నది. నిజసత్తాయొక్క ఆంతరికానుభూతిలో యదార్థతయున్నది కాని బాహ్యరూపకమైన ప్రపంచములేదు.

ఉపనిషత్తులలో నెచ్చటనేగాని యీ అవస్థాత్రయము భ్రాంతియనియు అనిత్యముయొక్క సృష్టియనియు, స్పష్టముగా జెప్పబడలేదు. ఇదంతయు అనగా మాయచే సృష్టింపబడినదని మనము తలపోయు ప్రపంచమంతయు బ్రహ్మమనియు, సత్యమనియు వేదోపనిషత్తులలో నిరంతరము ప్రవచింపబడినది. బ్రహ్మమే జీవకోటి యైనది. బ్రహ్మమందు సత్యమందు సకలజీవకోటిని చూడవలెను. జీవకోటిలో బ్రహ్మమును చూడవలెను. బ్రహ్మమే ఈ జీవకోటి అయినదని చూడవలెను ఆత్మమాత్రమే బ్రహ్మముకాదు సర్వము ఆత్మమయము. ఉన్నదంతయు బ్రహ్మమే, సత్యమే. ఈ ప్రవచనములలో మిధ్యామాయకు చోటులేదు. కాని నిద్రాస్వప్నావస్థల వివరణములనుండి, మాయావాదమునకు కొంత ఆస్పదము కలిగినది.

యాజ్ఞవల్క్య మహర్షి, బృహదారణ్యక ఉపనిషత్తులో సత్తయొక్క రెండుస్థితులను, రెండు ప్రపంచములుగా వర్ణించుచు, స్వప్నావస్థలో యీ లోకములను చూడవచ్చునని జెప్పెను ఆత్మయొక్క క్రింది మూడవస్థలను బ్రహ్మముయొక్క ప్రజ్ఞాస్థితిగా వర్ణింపవచ్చును. నిద్రాస్వప్నముల ద్వారాగాక ఆధ్యాత్మిక మెలుకువలో ఊర్ధ్వ చేతనల లోనికి బోయితిమేని. యీ యన్ని యవస్థలలోని బ్రహ్మముయొక్క వాస్తవికతను మనమెఱుగుదుము.

మిధ్యాస్వరూపమైన మాయను మనమీ స్థితులలో పరీకింప నవసరముండదు. మనస్సునుండి అతీతమనస్సుద్వారా పరబ్రహ్మసత్తకు బోయిన

ప్పుడు యీ అవాంతరస్థితుల నన్నిటిని జూచుచు అట్టితటి మన మనసునకు ప్రపంచము మిథ్యగా కనబడదు కాని హఠాత్తుగా జాగ్రత మనస్సునుండి పరచేతనలోనికి బోయినప్పుడు. సమాధిస్థితిలో నిమగ్నులైనపుడు ప్రపంచమ నిత్యముగతోచును. ఈ మిథ్యానుభూతివలన జగము మాయయొక్క సృష్టి యని తలంచుచున్నాము. కాని ఆధ్యాత్మానుభూతి వలన కృత్స్నజ్ఞానము కలిగి పూర్ణసత్యము భాసిల్లును. బ్రహ్మముయొక్క చైతన్యము. స్థితియందును గతియందును ద్వైతమగుచో. లేదా అనేకమగుచో. బ్రహ్మసత్తాలో ద్వైతము అనేకము యదార్థముగ నుండుటకు సామర్థ్యము గలదై యుండును. అప్పుడు విశ్వచైతన్యము సృజనాత్మక భ్రాంతిగాక. కేవలము యొక్క పరిమిత సత్యా నుభూతి యగును

శంకరుల తత్త్వము యీ విచారమున. విశిష్ట మాయా తత్త్వమని (Qualified Illusionism) చెప్పవచ్చును. మాయకు పరిమితసత్యము యీ తత్త్వములో చూపబడినది దీనిని (మాయను) వాచామగోచర మైనట్టిదియు. అగణనీయమైనట్టిదియు. అద్భుతరహస్యముగా వర్ణించి. మనస్సునకు సం తృప్తి నొసగువిధమున జగదనిత్యతను మానవ మూఢత్వమును. అశాశ్వత జీవిత పరిధులను. నిరూపించి శంకరుడీ తత్వమును. మహోన్నత విస్తారత తోను. శక్తివంతముగను లోకమునకు సమర్పించినాడు. శంకరులు స్వతః స్ఫురణ విజ్ఞానముచే కేవలము అతీతమైన ఆంతరిక సత్తయొక్క సత్యమును చక్కగా నిర్ణయించి తన అఖండ మేధాశక్తిచే ప్రపంచవిధమును. దాని అని త్యతను నిరూపించెను. బుద్ధియొక్క వివేచనాశక్తిచే వాస్తవజగమును. అం తరిక విజ్ఞానముచే అతీతమును వర్ణించియు శంకరుడీ రెంటియొక్క సమ న్వయమును సమగ్రముగా ననుసరింపకుండుట దురదృష్టము.

ఈ ప్రపంచముయొక్క భౌతిక ధర్మమే బుద్ధికి సుపరిచితము. కనుక మానవ వివేచనాశక్తి జగమును బుద్ధిచే పరిశీలించి వ్యవహరించుచున్నది. ఏకత్వమునందు పృథక్త్వము, నానాత్వమునందు ఏకత్వము అను ధర్మతత్త్వమును బుద్ధి సమగ్రముగ గ్రహింపలేదు. కాని ఏకస్థమైన పృథగ్భావమునందలి ఏకత్వమునో పృథక్త్వమునో సన్నజేయుటకది ప్రయత్నించును అద్వితీయము కేవలము శాశ్వతమునైన ఒకసత్త, అనిత్యము, ఖండమునైన యింకొక సత్త,- యీ రెంటికిని వికల్పము, విసంవాదము కలుగజేయుచున్నది.జీవాత్మ నిజముగా బ్రహ్మమే. అది బ్రహ్మమై మాయా క్షేత్రములలో మాయకు లోనైనట్లు కనబడి, తుదకు నిత్యమైన బ్రహ్మసత్తాలో నైక్యమొందును. సాపేక్షికములతో గూడిన అనిత్యజగములో సర్వజీవకోటియు బ్రహ్మముగా మనము అనుభూతి నొందుచున్నాము. ఇందువలన అతీతము, సమస్తము వ్యస్తము అన్నియు బ్రహ్మమేనని తేలుచున్నది.

కాలములోనున్న చేతనకు అది యదార్థమై, జగము, దానిలోని సంఘటనలు వాస్తవముగనున్నవి. కాని ఈ సత్యముయొక్క స్వభావము, పరిమితి యెట్టిదను ప్రశ్న మనకుదయించును. ప్రపంచము, మనము, వీనిలో కొంత తక్కువ వాస్తవికతయున్నను యదార్థము కావచ్చును. లేదా అవి కొంచెము నిజముగను, కొంచెము అబద్ధముగను లేదా పూర్తి అబద్ధముగ నుండ వచ్చును. అవి పూర్ణ సత్యములైనచో మాయాతత్త్వమునకు మిథ్యాజగత్తునకు చోటుండదు. అవి కొంచెము నిజము, కొంచెము అబద్ధమైనచో దీనికి తప్పిదము మనలోనేయున్నది. అది విశ్వచేతనా స్వసంవేదనయందో లేదా జగమును మనలను చూచుటయందు మనకు కలిగిన అజ్ఞానజనితమగు దృష్టిలోపమందో కలిగినదియగును. కాని యీ దోషము అవిద్యాజనితమో లేకమిశ్రమ జ్ఞానాజ్ఞానములో యగును, అట్లగుచో విశదపరుపవలసిన విషయము జగ

న్మిధ్యకాదు కాని సృజనచేతనలోను. అనంతసత్తలోని గతిక్రియలోను అవిద్య ఎటుల నడుమవచ్చినది విశదీకరింపవలెను. అయితే జగము మనము అసత్య సత్యమైనవో. అతీతచైతన్యమునకీ యునికి యదార్థముగాక మాయా క్షేత్రమునుండి విరమణ మొందినతోడనే తాత్కాలిక వాస్తవికత ఆగిపోయి నపుడు ఒకప్పుడు సత్యముగా చూచినది అసత్యమై ఒకచేతితో సమ్మతముతో నివ్వబడినది యింకొక చేతితో తీసికొని పోబడినదగును మాయ, ప్రపంచము మనము— యివన్నియు సత్యము మరియు అసత్యము.— కాని సత్యము అసత్య సత్యముగనున్నది ఇది మన అజ్ఞానమునకు మాత్రము నిజమై సత్య జ్ఞానమునకు అబద్ధనుగును.

ఏదో ఒకవిధమగు వాస్తవికత ప్రపంచమునకును, మనకును వున్నదని ఒప్పుకొన్నప్పుడు యీ సరిహద్దులలోనే అది వాస్తవమైన సత్యమేల కాకూడదో బోధపడదు. ఆవిష్కారము ఆవిష్కరించెడు దానికన్న పరిమితమైనదని ఒప్పుకోవచ్చును. మన ప్రపంచము బ్రహ్మముయొక్క లయలలో నొకటియై. ఆంతరికసత్తాలోతప్ప పూర్ణయదార్థముకాదు. అంతమాత్రముననే దానిని వాస్తవముకాదని చెప్పుటసరికాదు. మనస్సు దానినుండి ఉపసంహరించుకొన్నప్పుడది ఆ విధముగా తోచవచ్చును. కాని మనస్సు ఆవిద్యా ఉపకరణమైనందున యిటువంటి వూహాలు జనించును. ఉన్నతచేతన కారోహించినహో యీబాధ తొలగిపోయి యీమిధ్యాభావముపశమనమగును. పరమచేతనకు ప్రపంచముమీద గౌరవము లేదనియు, అది కల్పన అనియు చెప్పుట తగదు జగము జగదతీతముపై ఆధారపడియే నిలువగలదు.

తుదకు ప్రపంచము అస్థిరమైనందున సత్యముకాదని నిరసింపబడుచున్నది. ఇందుకు ఉపమానములు ఘటము, మృత్తికలుగా చూపబడుచున్నవి.

ఎట్లు ఘటమునశించి మృత్తికలో కలియుచున్నదో అస్థిరమగు నామరూపము లతో కూడిన జగము లయమగుచున్నందున అది మాయ యనబడుచున్నది. కాని యీ యుదాహరణమింకొక రీతిగా త్రిప్పివేయవచ్చును. వాస్తవపదార్థ మైన భూమినుండి వచ్చిన మృత్తికనుండి చేయబడిన ఘటము వాస్తవమే యగును. ఘటము తన మొదటిస్థితియగు మృత్తికలో లయమైనను దాని పూర్వస్థితి భ్రమాత్మకమగు మాయకాదు. ఇచట సంబంధము ప్రధాన వాస్త వికతయు, వ్యావహారిక అనిత్యతయుకాదు. కాని ఈ సంబంధము మొదటి సత్త అయిన ఆకాశమునుండి వచ్చి అవ్యక్తమైన పృథ్వియును తత్ఫలితమైన తాత్కాలిక అభివ్యక్త వాస్తవికతయునగును. ఘటాకారము పృథ్వియొక్క శాశ్వత సంభావ్యతయగును, లేదా ఆకాశముయొక్క సంభావ్యతయగును. పదార్థమున్నప్పుడు రూపము నెప్పటికైనను ఆవిష్కరింపవచ్చును. రూపము అదృశ్యము కావచ్చును. అప్పుడది సృష్టినుండి మొదటి అవ్యక్తస్థితికిపోవును. ఒక ప్రపంచము లయముకావచ్చును. కాని ప్రపంచస్థితియనునది అశాశ్వత మనుటకు ప్రమాణములేదు మరేమన బ్రహ్మమందు ఆవిష్కరణశక్తి సహ జముగా నున్నదనియు, అది కాల నిత్యతయందును లేదా శాశ్వత సంభావ్య మందును వ్యవహరించునని మనము భావింపనగును. జగము అతీత సత్యము యొక్క విభిన్నక్రమము గలదైనను, అది లేదనిగాని, ఆ యతీతమునకు కల్లగానున్నదనిగాని ఊహింపనవసరములేదు. కాలాతీత సత్యమొక్కటియే నిజమనియు, దీనిపై నాధారపడిన కాలము, జగము అబద్ధమనియు సనాతన ముగనుండు పరమసత్తయే నిజమనియు, దీనిపై నాధారపడి సృజింపబడి లయమగు జగము అబద్ధమనియు చెప్పబడు భావములు బుద్ధికి సంబంధించి నవికాని, యదార్థమైన ఆధ్యాత్మికానుభవోపలబ్ధులు కావు.

జగమనునది యొకటి యున్నప్పుడు దాని నావిష్కరింప జేయున

దొకటి యుండవలెను. కేవలసత్తాకు వాస్తవికతలేక యెల్లప్పుడును మిథ్యా రూపములనే సృజించునని తలపోయుట పొరపాటు. నిత్యసత్తనుండి అసత్తు రానేరాదు. కేవల సత్యముయొక్క నిర్మాణములు సత్యములుగానే యుండ వలెనుగాని, అసత్యములు కానేరవు. కేవలసత్తయొక్కటియే యున్నందున దానినుండి అభివ్యక్తమైన నిర్మాణములన్నియు దానివే యగునుకాని, శూన్య మునుండి మాయచే సృజింపబడిన ఆకారపూజ్యములుకావు.

జగము అనిత్యము. మిథ్య యనుటకు మూలము మనకు కలుగు అఖండ నిర్గుణ, అనంత పరబ్రహ్మయొక్క ఆధ్యాత్మికానుభూతి. నిశ్చలత యందు ప్రపంచమునకు వెనుకనున్న ఏదోఒక వస్తువు మన యింద్రియము లకును, మనస్సునకు గోచరమగును. కాని దీని యదార్థతను సమగ్రముగా ఉపలబ్ధి పొందక పోయినపుడును, సత్యవస్తువుయొక్క భిన్నముఖములు స్థితులు సమగ్రముగా తెలియనపుడును జగన్మిథ్యా భావముదయించును.

పరమసత్యము ప్రపంచసృష్టియందు ఈశ్వరుడుగ అభివ్యక్తమగును. ఈశ్వరుడు తన మాయా సృజనశక్తిచే ప్రపంచమును సృష్టిజేసి, ఈవస్తుచయ సృష్టిని ఆ పరిశుద్ధ పరమాత్మపై నారోపించును. ఇంకను సత్యబ్రహ్మము ప్రపంచ వ్యష్టిరూపములో జీవునియొక్క ఆత్మగా కనబడును. జ్ఞానోదయ మైనపుడు జీవాత్మ పరమాత్మతో నైక్యమొందును. అపుడు జీవాత్మ మాయ కతీతమై పరమసత్తాలో లయమగును. కాని ప్రపంచము యథాప్రకారము ఆద్యంతములులేక ఈశ్వరునియొక్క మాయాసృష్టిగా నడుచుచుండును.

మాయ యదార్థముగను, యదార్థముగాకను యున్నది. జగము ఒట్టి భ్రాంతికాదు. అది వున్నది. కాలములో అదినిజముగ నున్నది. కాని కడ

పటికి అతీతమునుండి చూచినపుడు అబద్ధమగుచున్నది. ఈశ్వరుడు మాయో త్రిమితుడు కాకపోయినను ఆయన మాయను సృజించువాడై బ్రహ్మయొక్క దృగ్విషయముగ కనబడుచు తుదిసత్యము కానేరడు. ఈశ్వరుడు తాను సృష్టించిన కాలజగతికి మాత్రము నిజము. జీవాత్మకూడ యిటువంటి రెండర్థములు కలదిగనున్నది. మాయ తన వ్యవహారములను మానుకొన్నచో ఈశ్వరుడు, జగము, జీవుడుండనేరరు కాని మాయ శాశ్వతముగనున్నది. ఈశ్వరుడు, జగము కాలములో శాశ్వతముగానున్నారు. జీవుడు జ్ఞానములో లయమగువరకు మాత్రముండును ఈ సందేహార్థములు, ద్వంద్వార్థములు యివన్నియు మనబుద్ధికతీతములై వాచామగోచరమైన విచిత్రములుగనున్నవి. ఈశ్వరుడు మాయాజనితముగాక, అతీత సత్యమునుండి అభివ్యక్తమైన సత్యము. అటులనే జగము, జీవుడుకూడ అతీతసత్యమునుండి అభివ్యక్తమయినవే. ఈశ్వరుడు, మాయ, జగము, జీవుడు యివన్నియు అతీతాంశములై కాలాతీతమునుండి వచ్చి కాలములో వ్యవహరించుచున్నవి. పరమసత్తారహస్యమెట్లు బుద్ధిగ్రాహ్యమున కతీతమో, ప్రపంచ రహస్యముకూడ బుద్ధిగ్రహణమున కతీతము. వీని యదార్థత తెలిసికొనవలెనన్న బుద్ధికి పైనయున్న విజ్ఞానస్తరమున కధిగమించినచో అన్ని సత్యముల యదార్థత విదితమగును.

బుద్ధుడు తన నిశిత సూక్ష్మబుద్ధిద్వారా ప్రపంచముయొక్క నిర్మాణమును, యీనిర్మాణమునుండి ఉపశమించు మార్గమునుమాత్రము కనుగొని, తరువాత ముందుకుబోను తిరస్కరించెను. శంకరుడు బుద్ధునికంటెను ముందంజవేసి బుద్ధుని సంస్కార శూన్యానుభవమున కతీతుడై, పరమసత్యమునకు ప్రపంచమునకు మధ్యలో నిలబడి, జగత్తుయొక్క రహస్యము ఛేదించరానిదనియు, బుద్ధిచే అగ్రాహ్యమనియు జెప్పెను. కాని బుద్ధితో జూచినపుడు

ప్రపంచము నిజముగా కనబడుచున్నందున దీనిని అనిత్యసత్యమనియు, కేవల
త్తయే యదార్థమనియు ప్రవచించెను. కాని శంకరులు యింకను బుద్ధి
గార్త్వముననున్న విజ్ఞానములోనికిబోయి, అచట స్థావరమేర్పరచుకొని సర్వ
ఖను పరిశీలించియుండినచో బ్రహ్మముయొక్క ముఖములన్నియు, స్థితిగతు
న్నియు సమగ్రముగ గోచరమయి వేదవాక్యప్రకారం సర్వము బ్రహ్మమని
న అఖండ మేధాశక్తితో నిర్ణయించెడివాడు.

సకలవిధములైన సంబంధములచే బంధింపబడని కేవలత్వముయొక్క
ద్వితీయత్వానుభవమును, బుద్ధ్యనవగాహ్యమైన చైతన్యతత్వమును మనో
ద్దులచే బహుప్రకారముల నుత్ప్రేక్షింపబడి, వ్యాఖ్యానింప బడుచున్నది.
త్తయొక్కటి మాత్రమే యున్నచో, మఱియు సర్వము అసత్తుకాగా ప్రపం
ము అసత్తునుండి వేఱుపరుపరానిది యగును. ప్రపంచముకూడ సత్యమే
పపంచము తన రూపాకారములలో మనకు దాని శక్తిరూపముల నిజసత్య
ఖను విశదపఱుపనిచో, అది దేశకాలములలో వ్యవహరించు కదలికగా కన
డినచో అది అసత్యమనియు పరమసత్తా కాదనియు చెప్పరాదు. కాని,
అది పరమసత్తాయొక్క క్రమావిష్కారమైనందునను కాలములో భిన్నగా
అభివ్యక్తమగు ఆ సత్తయైనందునను, మనబుద్ధి దాని స్థితిగతులను సమగ్ర
ముగ నవగాహనము జేసికొనలేకయున్నది. ఈ విధముగా అర్థముచేసికొన్న
ప్పుడు, ప్రపంచము సత్తనియు అసత్తయనియు 'అది' యనియు 'అదికా
దనియు జెప్పవచ్చును. సత్తయొక్క యదార్థతనంతయును ఏ స్వరూపములో
గాని, స్వరూపములలోగాని ప్రపంచము విదితపరచనందున, అది సత్తుకాదని
చెప్పవచ్చును. అంతములన్నియు అంతరంగికముగ జూచిన, అనంతములే
సత్తకు ఆవిష్కరణ చేయవలసిన పనిలేదనియు, అందువలన జగము సత్తు
యొక్క ఆవిష్కరణ కాదనియు చెప్పుదురు ఇందుకు జవాబు, సత్తకు

ఎటువంటి భ్రమతో పనిలేదనియు, అందువలన భ్రమాత్మకమైన జగమును సృష్టించవలసిన పనిలేదని కూడ చెప్పవచ్చును. కేవలత్త్వమున కెటువంటి ఆవశ్యకతలేదు. ఐనను కేవలత్త్వము తన స్వేచ్ఛచే, ఎటువంటి దానినైనను, ఏవిధముగనైనను సృష్టింపవచ్చును. ఈశక్తి ఆ కేవలత్వములో యిమిడి యున్నది. కేవలత్వము శాశ్వత కాలాతీతములో తనకుతానై నిరాకారస్థితిలో నుండగలిగినపుడు, ఆ కేవలత్వము సాకారములో కాలగతిలో వ్యవహరింప వచ్చునుకూడ జగము తాత్కాలిక సత్యమైనను అది బ్రహ్మముయొక్క ఆవిష్కారమే. ఏలన, సర్వము బ్రహ్మమైనపుడు స్థితియు, గతియు, సాకారము, నిరాకారము, ఏకత్వము, అనేకత్వము, నిష్క్రియత్వము, సక్రియత్వము అన్నియు ఆ కేవలసత్తయేయగును. గనుక, బ్రహ్మమునుండి జగమును వేరుపరచి యివి ద్వైతమని భావించుటతగదు

మనము వేఱని భావించుటయు, అంతము (జగము) అనంతములో నొక స్వతఃస్థిత వస్తువని తలచుటయు, యీ భావనమాత్రమే యసత్య సత్యము (Un-real Reality) మఱేదియు కాదు. కాలాతీతముయొక్క ఆవిష్కారము కాలముయొక్క క్రమపరంపరలలో జరుగుచుండును. కాన, దాని రూపములు ఉపరితలమున తాత్కాలికముగ కనబడియుండవలసివచ్చును. అయితే, అవి వానియొక్క ఆవిష్కార శక్తియందు శాశ్వతముగనున్నవి. బీజరూపమైన కాలాతీత చైతన్యసత్తు కాలగతిరూప సంభావ్యముల నీనుచున్నది. ప్రపంచమును, దానియొక్క రూపములును సారములేని చిత్తరువులై సత్తయొక్క ఊహాకల్పితములైనచో, అవి అనిత్యమగును. కాని, ఆవిష్కారము, ఆవిష్కారశక్తి నిత్యమైనచో (Eternal) సర్వము బ్రహ్మసత్తాయైనచో యీ అసత్యము, భ్రాంతి, వస్తువుల స్వభావస్థితులు కానేరవు.

ప్రపంచము అనిత్యమనియో లేక భ్రాంతి యనియో చెప్పు మాయా సిద్ధాంతము, సమస్యలను విడతీయుటకు బదులు ఎక్కువ కష్టములను కలుగ జేయును. ఈ సిద్ధాంతమెప్పటికిని ఉనికియొక్క స్థితినిగుఱించిన రహస్య సమస్యను విడదీయక, దాని విమోచనాసాధ్యతను కష్టతర మొనర్చును. మాయా సిద్ధాంతము మనలను ప్రపంచాన్ని సున్నచేసి, మానవ జీవితమును హేయపరచును. ప్రపంచము భ్రాంతియైనచో, మనకుకలుగు విశ్వచేతనాను భూతి, సర్వము బ్రహ్మలోనున్నవనియు, బ్రహ్మ అన్నిటిలో నున్నదనియు, సర్వము బ్రహ్మమనియు. కలుగు అనుభూతులనెల్ల యీ సిద్ధాంతం కల్ల జేయును అటులనే పరమాత్మానుభూతికూడ భ్రాంతియగును. ఈ వైఖరి ననుసరించియే, బౌద్ధులు ప్రపంచాన్ని, ఆత్మను, వ్యష్టిని, పరమాత్మను సర్వం కల్లయనిరి. ఈ పరిస్థితులలో, 'తత్త్వమసి', 'అహంబ్రహ్మాస్మి', 'సర్వంబ్రహ్మమయం' అను మహావాక్యము లర్థహీనములగును. పదార్థ విజ్ఞాన శాస్త్రంవలె, ఆత్మవిచారముకూడ, అనుభవమూలముననున, విచారమూలము నను అన్నిటిని పరిశోధించి వాని సత్యముల నిరూపింపవలెనేగాని, ఇందుకు విరుద్ధంగా అన్నిటిని భ్రాంతియని త్రోసిపుచ్చుట సమంజసముకాదు

అన్ని సత్యముల నిరూపణమునకు ప్రమాణం, ఆధ్యాత్మిక ప్రదీప్తి. ఒక సత్యమైన ఆధ్యాత్మికానుభవము అనేక వ్యూహములతో పొసగు బుద్ధి యొక్క విచార ఊహాభావ అనుమానసౌధములనన్నిటిని నిర్మూలముజేయును.

పరమాత్మను చేరు మార్గములు వందలకొలదియున్నవి. మార్గాన్నను సరించి అనుభవము సిద్ధమగును అనిర్వచనీయమగు ఆ సత్యాన్ని ఏకాత్మ ప్రత్యయసారముగ కనుగొనవచ్చును. లేదా సర్వం బ్రహ్మముగకూడ కను

గొనవచ్చును. సర్వము వున్నదనియు. సర్వము లేదనియుకూడ నిరూపించ వచ్చును ద్వంద్వాద్వందాల కతీతముగ. ఆ పరమవస్తువు సమగ్రముగ నున్నది. కనుక యీ అఖండ సమగ్రానుభూతిని బొందుటకు సాధన చేయ వలెను దేనిని తెలిసికొనిన సర్వము తెలిసి సర్వము బ్రహ్మమగునో అదియే పరమసత్త (Supreme Reality). కాని మాయావాదం ప్రకారము దేనిని తెలిసికొనిన అన్నియు భ్రిమాత్మకమగునో అదియే పరమసత్తగ నిరూపింప బడుచున్నది !

అన్నిసత్యములు. పరస్పర వైరుధ్యములు. న్యాయమైనను వీటికన్ని టికి సామంజస్యమునొక బృహత్తర సత్యములో చేకూరవలెను అన్నితత్త్వ ములు. సిద్ధాంతములు. పరమసత్తను ఒకానొక పార్శ్వమునుండియో. వివిధ పార్శ్వములనుండియో జూచుచున్నందున. యివన్నియుకూడ పరమసత్త యొక్క అనేకరూపములను ముఖములను ఆవిష్కరింపుచున్నందున. యివ న్నియు సత్యములే. ఇవి పరమ సత్తయొక్క సమగ్రరూపమును తెలుప కున్నను యివి తెలుపునదంతయు యదార్థమేయగును ప్రతివ్యక్తియు తన అనుభవమునకు తగినట్లు ఒకతత్త్వము నిరూపించును. పలువిధ వ్యక్తుల పలు విధ అనుభూతులనుండి అనంతమునకు అనంతదశలున్నవని రుజువగుచున్నది. ఒకదశలో జీవునికి కలుగు పలువిధ అనుభవములలో నొకటి ఆకర్షణీయమై ఏకాగ్రిమై. మిగత అనుభవములన్నియు అసత్యములుగ కనబడవచ్చును. ఈ స్థితిలో ప్రపంచముకూడ అనిత్యముగ తోచవచ్చును. అప్పుడు సర్వముభ్రాంతి రూపకమై. ఒక నిర్గుణ అచలబ్రహ్మమే. యదార్థముగ కనబడవచ్చును. కాని. యింతటితో తృప్తిపడక. చేతన యింకను ముందుకుపోయినచో నూతన ఆధ్యాత్మిక దర్శనము కలుగును. అప్పుడు శూన్యనిర్వాణమును. విశ్వచైత న్యమును. రెంటిని సమన్వయ పరచునట్టిన్ని. ఈ రెండును దేనియొక్క

స్వసంభూతులో అట్టి పరమసత్తను కనుగొనవచ్చును మనోభూమికనుండి విజ్ఞానభూమికకు చేరినపుడు, యీ సంపూర్ణ దృష్టి లభించును.

"దివ్యసత్త" యననేమి? అను ప్రశ్నపై అంతయు నాధారపడును. మనకు కలుగు అనుభవ స్పర్శలకనుగుణ్యముగా జగము మనకు విదిత మగుచున్నది దివ్యసత్తయు జగత్సత్తయు వీనిని గురించిన జ్ఞానము మన మనో ఇంద్రియ బుద్ధులపై నాధారపడియుండును ఇంద్రియములకు భూమి గుండ్రముగా కనబడదు. గనుక అది సమముగా నున్నదని నిర్ణయింపవలసి వచ్చును కాని, నిజస్థితిలో ప్రకృతి విజ్ఞాన శాస్త్రరీత్యా, భూమి చదునుగా లేక గుండ్రముగా నున్నది. ఇట్లనేక విధముల ప్రకృతివిజ్ఞానము ఇంద్రియ జ్ఞానమును కల్లజేయుచున్నది అటులనే భౌతిక శాస్త్రజ్ఞుడు తనభౌతిక పరికరములద్వారా కనుగొనిన నిర్ణయములనే యదార్థమనును, ఆతని దృష్టిలో జడమునుండి మనస్సు సంభవించినట్లున్ను. ఆత్మయు పరమాత్మయు అబద్ధముగనున్నవి. అతని ప్రకారము జడము, ప్రాణశక్తి మాత్రము యదార్ధములై మనస్సు భౌతికమును చూచు ద్రష్టగనున్నది. మనోవైజ్ఞానికుడు ఇంక కొంచెము లోతునకు బోయి మనోధర్మములను కనిపెట్టును. అతనిదృష్టిలో భౌతికము మానసిక లీలావ్యవహారముల క్షేత్రముగనున్నది. కాని యింకను ముందుకు బోయినచో మనకు ఆత్మ పరమాత్మయొక్క యదార్థములు గోచరించును. అప్పుడు ఆత్మపై జగము ఆధారపడినట్లున్ను, మనో భౌతికములు ఆత్మకంటె తక్కువ తత్త్వములుగ గోచరించును. కాని ఆదిమ, కేవల చైతన్యము ఉనికిలోనున్న అన్నిటిని సమగ్ర దృష్టితో కౌగిలించుకొని తన నిజ సత్తా స్వరూపములుగ కనుగొని, జగమును, ఆత్మను, వ్యక్తిని వీనినన్నిటిని వీనియొక్క స్థితిగతులను, సర్వమును విజ్ఞానదృష్టితో వివాదరహితముగ జూచును.

కేవలత్వము హద్దుపరుపరానిది. అది రూపముచేగాని అరూపముచే గాని మితపరుపరానిది. అది నిష్క్రియత్వముచేగాని. క్రియత్వముచేగాని. స్థితిచేగాని, గతిచేగాని మితపరుపరానిది. అది రూపము నావిష్కరించినచో. రూపము దానిని మితపరుపనేరదు అది, గతిని సంభూతిని అభివ్యక్త పరచినపుడు గతి దానిని చలింపజేయనేరదు. సంభూతి దానిని మార్చలేదు. అది స్వసృష్టిచేత తఱుగనేరదు. ఏ విధముగ నైనను మితపరుపబడదు. భౌతిక వస్తువులుకూడ వానియొక్క ఆవిష్కరణముకంటె ఉన్నతముగనున్నవి. మృత్తిక దానినుండి చేయబడిన ఘటములవల్ల మితపరుపబడదు అటులనే గాలి దానిలో సంచరించు వాయువులచేగాని, సముద్రము దానిలో సంభవించు అలలచేగాని, పరిమితములుకావు. ఈ పరిమితభావము మనస్సులోను యింద్రియములలోను అవి అనంతముకంటె భిన్నముగా జూచుటచే కలుగుచున్నది. ఈ పరిమిత భావమే మిధ్యకాని, అనంతము అంతము మిధ్యలుకావు అనంతము, అంతము ఇవి తమ స్థితికి మనోయింద్రియములపై ఆధారపడివుండక అవి కేవలత్వముపై నాధారపడియున్నవి.

ఈ కేవలత్వము (The Absolute) బ్రహ్మము. బుద్ధిచే గ్రహింపనలవి గానిదై అనిర్వచనీయముగ నున్నది. ఏమియులేని అసత్తుగను,శూన్యముగను, దానిని సమీపించవచ్చును. అటులనే దానిలో అన్నియున్నట్లుగను అదికేవల జ్యోతిగను, కేవల ప్రేమగను, కేవల సౌందర్యముగను, కేవల జ్ఞానముగను, కేవల శాంతినిశ్చలతగను సమీపింపవచ్చును. అటులనే ప్రత్యేకముగా దానిని కేవల సత్తగను, చేతనగను, ఆనందముగను, లేదా ఒకే సచ్చిదానందముగను సమీపించవచ్చును. కేవలత్వ ప్రవేశము, జగత్తును. వ్యష్టిని వీనిని లేవనుటవలననే కలుగునని తలపబడుచున్నది. కాని, నిజస్థితిలో వ్యక్తి తనక్షుద్రపరిమిత అహంకారమును త్యజించి తననైజ ఆధ్యాత్మిక

వ్యక్తిత్వమును ధరించినపుడు, అహమునకు, విశ్వమునకు, విశ్వాతీతమునకు అతీతుడై కేవలత్వముయొక్క ప్రాప్తినొందగలడు.

అటులనే జీవుడు విశ్వచేతనా రూఢుడై విశ్వచైతన్యమయుడై, విశ్వ చైతన్యమును తనలోనికి తీసికొని ఊర్ధ్వమునకేగి అచట ప్రతిఒకదానిలో నన్నిటిని అన్నిటిలో ప్రతిఒకదానిని, అన్నియు ఒకదానిలో జూచుచు, కేవ లత్వమును సమీపింప వచ్చును కేవలత్వము సత్తునకు, అసత్తునకు అతీతమై సత్తునుగాక అసత్తునుగాక యివి రెండునుకూడనై వర్ణింపనలవిగానిదై, అఖండమును అద్భుతముగను అనంతముగనున్నది.

అవ్యక్తము, వ్యక్తము రెండునుగలవు. కాని సత్య పదార్ధమునుండి ఆవిష్కరించునది సత్యమై యుండవలెనుగాని, అసత్యమగుటకు వీలులేదు. అటులనే కాలాతీతము, కాలము రెండున్నవి. కాలములో సంభవించునది కాలాతీతములో నుండవలెను. లేకున్న కాలములో అది అనిత్యమగుటకు వీలులేదు. నా ఆత్మయు పరమాత్మయు, సత్యమైనపుడు వీనినుండి జనించు నాతలంపులు, భావనలు మిగత నా అన్నిశక్తులు, అసత్యములు కానేరవు అటులనే ఆత్మను ధరించి, అందులో నివసించు నా శరీరము నిజమగునేకాని, శూన్యముకానేరదు. సారములేని వట్టినీడకానేరదు. ఈ విరుద్ధములకు సమ న్వయ సూత్రమే మనకాలాతీతము, కాలము. యివిరెండును కేవల సత్యము యొక్క రెండుముఖములై రెండును యదార్ధములై కాలాతీతములో అభి వ్యక్తముకానిది కాలములో అభివ్యక్తమగుచున్నది.

ఆవిష్కారమంతయు సత్తుపై నాధారపడును. అది చేతనపైనను దాని దశాశక్తులపైన సహితము ఆధారపడును. చైతన్యముయొక్క స్థితిననుస

రించి సత్తయొక్క స్థితికూడనుండును. నిశ్చేతనముకూడ అంతర్నిమగ్న చేతన యొక్క స్థితియు గతియు నై యున్నది. ఈ అంతర్నిహిత చేతనయే నిశ్చేతనమునుండి బయటికివచ్చి నిశ్చేతనములో ప్రపంచమును అభివ్యక్త పరచు చున్నది. అటులనే కేవలసత్తలోనికి తీసికొనిపోబడిన చేతనయే ఊర్ధ్వ చేతనము (Superconscient) ఊర్ధ్వచేతనములో కూడ చేతన నిమగ్నమై. ఒక దశలో తన్నుతా తెలియకున్నది. నిత్యసత్తతో చిత్శక్తి కూడిన స్థితియే పరమేశ్వరుడు.

సర్వము సత్యమైన బ్రహ్మమగుచో ప్రపంచపు ఉనికిలో కనబడు అసత్యతకు కారణమరయవలయును ఈ అసత్యత సత్తయొక్క స్థితికానిచో యిది చేతనయొక్క నిర్మాణముగ, లేక క్రియగనుండవలెను చేతనయొక్క యొక ఆవస్థాస్థితిలో దానినిర్మాణము క్రియలు అసత్యముగ కనబడుచుండుట నిజమే ఇదియే మనస్సుయొక్క స్థితి మనస్సునకు సత్యముకాని వస్తువులను పూర్తి సత్యముకాని వస్తువులను ఊహించు శక్తి ఉన్నది దీనికి కారణము మన అజ్ఞానమే. ఈ అజ్ఞానమువల్ల అసంపూర్ణ ఆవిష్కారము కలుగు చున్నది. కాని యీ అజ్ఞానము శాశ్వతమగుచో ప్రపంచమునుండి లయమగు టయే శ్రేయస్కర విధియగుచున్నది. కాని ప్రపంచములో పరిణామశక్తి యున్నది. ఈ అజ్ఞాన స్థితినుండి మనమును ప్రపంచమును, జ్ఞానస్థితికి పరి ణతి జెందుచున్నాము మన ప్రపంచములో ఊర్ధ్వదశకు జెందినస్థితి నిమగ్న దశలో యున్నందున దీనినుండి ఉచ్ఛదశ ఆవిష్కరించుటకు సాధ్యతయున్నది. కాలముయొక్క ఆవిష్కారములో క్రొత్త యదార్థతలు సిద్ధింప వీలయి యిదే వరకు అభివ్యక్తముకాని సాధ్యతలు సిద్ధించుచున్నవి. ఇంకను భౌతికములో రూపొందని స్థితులు అతిభౌతికములో యదార్థముగనున్నవి ఇట్లున్నను మన మనస్సు కండ్లకగపడు వస్తుస్థితులనే యదార్థములనును. కాని మిగతా

సంభావ్యతలను యింకను సూక్ష్మదశలో సత్తారూపకముగ నున్నవానిని యదార్థమనదు, కనుక, అసత్యత పూర్ణజ్ఞానములేని మన మనస్సు నందున్న దేకాని. అసత్యత అనునది ఎక్కడనులేదు పై విచారణవలన సర్వము బ్రహ్మమనియు, ప్రపంచము మిధ్యకాదనియు తేలుచున్నది.

స్థితిరూపకముగను, వేరుగను, నిరాకారముగనుండు ఆత్మకు ఆవల మహోన్నత చేతనయున్నది. ఈ బృహత్ చైతన్యములో నిశ్చలతయు విశ్వ కార్యకలాపము యీ రెండును కలిసికొని ఏకముగనున్నవి స్థితిరూపకమైన సత్త (Static Self) దివ్యసత్త (Divine Reality) యొక్క ఒకపార్శ్వము మాత్రమేయగును ఈ స్థితి రూపకమైన సత్త ఒక అంతస్తు మాత్రమే యగును. దీనిలోనున్నప్పుడు, దీనికావలబోనపుడు దీనినే తుదిమెట్టుగానెంచి మాయావాదులు జగమును మిధ్యగా భావించిరి. కాని మానవుడు ఆ బృహచ్చైతన్యమును చేరినపుడు విశ్వస్థితి, రూపము, జీవితము, మనస్సు యిన్నియు ఆకస్మికములుగ కనబడక అర్థవంతమగును. ఊర్ధ్వగతిలో సహితము రెండంతస్తులు అధిమానసము, అతీతమానసమనునవి యున్నవి. కాని అతీతమానసస్థితిని చేరినపుడే మానవునికి విశ్వస్థితిగతులయొక్క నిజస్వభావ సత్యములు సమగ్రముగా గోచరింపగలవు.

## శంకర, శ్రీఅరవింద విజ్ఞానములు :

శంకరుని విజ్ఞానము, సత్యముయొక్క ఒక భాగమును మాత్రమే తెలుపుచున్నది. పరమసత్తాయొక్క విజ్ఞానానుభూతిని ఉనికియొక్క కేవల నిశ్చలస్థితి మూలమున, ఆధ్యాత్మిక మనస్సు పొందిన ఉపలబ్ధియే, ఇది. శంకరుడు ఆధ్యాత్మిక మనస్సుద్వారమున పరమసత్తాకు బోయినందున, జగత్తు

యొక్క మూలమును. జగమును సమగ్రముగ వివరించలేక. యివి మాయా జనితములనియు. మిథ్యయనియు వివరించెను. పరమ సత్తను స్థితిరూపకము గను. గతి రూపకముగను (Static and Dynamic) ఉభయ పక్షముల ద్వారా నుపలబ్ది పొందనపుడు. వస్తువులయొక్క యదార్ధ మూలమును సగుణ బ్రహ్మముయొక్క యదార్ధతను. అనుభవించను వీలుకాదు. ఈ పరిస్థితిలో పరమసత్తయొక్క శక్తి మిథ్యాశక్తి మాత్రమై. ప్రపంచము అగ్రాహ్యామై. యీ విశ్వమొక వింతరహస్యమై. శాశ్వత పరబ్రహ్మముయొక్కశక్తి శాశ్వత ఉన్మాదమై వెఱ్ఱితనముగ కనబడును. మానవతర్కము దీనికెంత సాయపడి నను. జగద్రహస్యము అనిర్వచనీయ మగును. పరబ్రహ్మను ద్వివిధరూప ములైన సత్తు. చిత్-శక్తి మూలమున. ఆంతరికముగ నుపలబ్ధి పొందినచో. సమగ్రజ్ఞానము లభించును. తాంత్రికులు యీ రెండవపక్షము నవలంభించి పెంపొందిరి. ఈ వేదాంత. తాంత్రిక ఉభయసత్యముల సమ్మేళనముచే. పూర్ణజ్ఞానము సిద్ధించును.

భగవద్గీతలో. (1) పురుషోత్తముడు (2) జీవుడై. ప్రపంచమును భరించు పరాశక్తి. అను నీ రెండువిషయములను గుఱించిన పూర్ణజ్ఞాన బోధ కనబడుచున్నది. ఈ రెండును. — పురుషోత్తమ పరాశక్తులు. — అనాదియై. వేఱుపరుపరానివై. ఏకముగనున్నవి పరాశక్తి ప్రపంచమును వెలువరిం చును. అది ప్రపంచములో భగవత్సత్తాను. ఈశ్వరునిగ అభివ్యక్తపరచి. అతని ప్రక్కననే ఈశ్వరశక్తిగా ప్రత్యక్షమగును. ఇంకొక విధముగా చెప్ప వలెనన్న పరమసత్తయే. తన పరమచైతన్యశక్తి మూలమున. ఈశ్వర—ఈశ్వరి ఆత్మ—ఆత్మశక్తి. పురుష—ప్రకృతి. జీవ-జగత్తులుగా అభివ్యక్తమగుచున్నది. మనస్సు ఉపలబ్ధిపొందనగు పూర్ణజ్ఞాన మిదియే. అతీత మానసములో యీ సమస్యలకు చోటులేదు. మనస్సు విభేదములను దివ్యసత్తయొక్క పక్షము

లను, కల్పించి వీనిని సమన్వయ పరచుటకు జూచును అతీత మానసవిజ్ఞానము కలిగినప్పుడు, సర్వము తేటతెల్లమగును

పరబ్రహ్మమొక అపరిచ్ఛిన్న, పరిశుద్ధ సత్తయు, చైతన్యమేగాక, సృష్టికి మూలము, నాధారమునై యున్నది. జగత్తు సత్యముగనున్నది. అతీత మానస విజ్ఞానము కలిగినపుడు, సృష్టియు, కర్మయు, అవిద్యాజనితములని గాక, దివ్యజ్యోతి సత్యానంద జనితములని స్పష్టమగును. శ్రీఅరవిందునిది సత్యాద్వైతముకాని, మిథ్యాద్వైతముకాదు. ప్రపంచము సత్యముయొక్క అభివ్యక్తిగనుక, ప్రపంచముకూడ సత్యమే ఈ సత్యమే అనంతాఖండ, దివ్య సచ్చిదానందము. ఈ సచ్చిదానందమే, తన యనంత సత్తాలో ప్రపంచమునభివ్యక్త పరచినది. కాని ఈ భౌతిక జగత్తులో, యీ సచ్చిదానందము తనకు భిన్నముగ కనబడు అసత్తు, నిశ్చేతనము, అజ్ఞానము వీనిలో దాగి యున్నది. ఈ దాగియున్న సత్తా ప్రపంచములో కనబడు నిశ్చేతనమునుండి మొదలు భౌతికముగను, పిమ్మట ప్రాణముగను, తరువాత మనస్సుగను విజృంభించి పరిణతి జెందుచున్నది. పైకి నిశ్చేతనముగా కనబడు యీ శక్తియే నిజముగా దివ్యసత్తయొక్క చైతన్యశక్తులుగనుండి, యివి నిశ్చేతనమునుండి ఊర్ధ్వగతిలో దివ్యచేత నానుభూతులగుచున్నవి దీనినే పరిణామ మందుము.

శ్రీఅరవిందుల సత్యాద్వైతములో సగుణము నిర్గుణంబు నుండి వచ్చునట్లున్ను, అది నిర్గుణముకన్న క్రిందిస్థాయిలో నున్నట్లున్ను చెప్పుట లేదు. సగుణ నిర్గుణములు రెండును ఒకే సత్యముయొక్క రెండు సామ్య పక్షములు, ఒకే సత్యముయొక్క సామ్యస్థితి, గతి ద్వయము. శాశ్వత శాంతి నిశ్చలతలు శాశ్వత క్రియా ప్రవృత్తులకు ఆధారముగ నున్నవి. దివ్య

సత్తా, యీ రెంటిలో దేనికిని కట్టుబడదు, ఏలన అది అపరిమితమై రెంటిని కలిగియున్నది. దివ్యసత్తాయొక్క శక్తి నిశ్చలతలోను కర్మ యందును స్థితి యందును, గతియందును సర్వదాయున్నది.

దివ్యపరిణామము పొందుటయే మనయునికియొక్క లక్ష్యము. శరీర ప్రాణ, మనస్సులనుండి ఊర్ధ్వగతిలో విజ్ఞాన కోశమునుజేరి విజ్ఞానశక్తి మూలమున శరీర, ప్రాణ, మనస్సులను విజ్ఞానమయ మొనర్చుటయే మన పరమావధిగ నున్నది.

## శ్రీఅరవింద, శంకరాచార్య తత్త్వవిశిష్టతా సంధానము

వేదాంతము అనేక రీతులుగనున్నది. వ్యక్తియొక్క ఆధ్యాత్మికానుభవముల ననుసరించి తత్త్వములు, మతములు, ప్రయోగములు ప్రపంచములో స్థాపింపబడినవి. ఒకే సత్యము అనేక విధములుగ నిర్ణయింపబడినది. ఇపుడు మనము శ్రీ శంకర వేదాంతమును శ్రీఅరవింద వేదాంతమును వీటికిగల విశిష్టతల గురించి పరిశీలింతము.

శంకరులది అద్వైత వేదాంతమని పిలువబడుచున్నది. ఇందులో ముఖ్యముగా బ్రహ్మము సత్యమనియు, జగము మిధ్యయనియు చెప్పబడుచున్నది. అదియునుగాక యీ ప్రపంచమంతయు మాయాన్వితమనియు, కైవల్యజ్ఞానము కలిగినపుడు, జగదాభాసము గోచరించుననియు చెప్పబడుచున్నది.

శంకరుల బ్రహ్మము సచ్చిదానందముయొక్క స్థితిస్వరూప నిరూపణము ఇది దేవుడు. ప్రపంచము. జీవుడు. మాయ. దేశము. కాలము మొదలగు సకల ఆద్యంతములుగల జగమునకు అతీతమైనని. శ్రీఅరవిందుల బ్రహ్మము స్థితి గతి. రెంటియొక్క స్వరూపమైనట్టి సచ్చిదానందము. అతీత మనస్సు. అది అతీతము, సమస్తము, వ్యస్తము; సత్త, సంభూతి. వీరిదృష్టిలో బ్రహ్మము శాశ్వత సృజన శక్తియుతమై ఈ సృజనశక్తి బ్రహ్మముయొక్క సమగ్ర భాగమై, నిజమైన ప్రపంచమును సృజించుచున్నది. శంకర బ్రహ్మమన్ననో, దేవుడు, జగము. మాయ మొదలగు వాటి నన్నిటిని కల్లయని కేవల నిర్గుణ సత్తనే సత్యమనును. అది సృష్టిని పరిణామమును అనిర్వచనీయ మనియు సర్వము మాయాజనితమనును, శ్రీఅరవిందులు మాయను వాచామగోచరమని చెప్పడు. దానిని బ్రహ్మముయొక్క ఆంతరిక సత్తాగా ఆయన భావించును. బ్రహ్మము శక్తి, శివుడు, కాళి, కృష్ణుడు, రాధ యివి ఒకటిగాని రెండుకావు. సత్తలో శక్తి స్థితిరూపముగను గతి రూపముగను యున్నది. దాని స్థితి యందు అది లేకపోలేదు: అప్పుడు అణగియున్నది, గతియందునులేకపోలేదు; అప్పుడు వ్యవహరించు చున్నది. ఈ శక్తి వేఱువస్తువై, బయటనుండి బ్రహ్మములోనికి ఏదో ఒక సమయమున వచ్చునని చెప్పుట సరికాదు. బ్రహ్మమునకున్న స్థితిగతులు సనాతనము, శాశ్వతము వీటిలో యేదియు విభ్రమము మిధ్యకాదు, గనుక శ్రీఅరవిందులు పూర్ణసత్యమును, పూర్ణ యోగమును, దివ్యజీవనమును నిరూపించినారు.

శంకర వేదాంతములో ఆత్మకు ద్వైతము నిరూపింపబడలేదు. అది ఎప్పుడును ఏకమై, నిత్యమై, అఖండమై పరిశుద్ధమైయున్నది. దీనికి అనేకత్వము సంభావ్యముకాదు. శ్రీఅరవిందులు ఆత్మకు ఏకత్వము, అనేకత్వము నిత్యత, అనిత్యత, సమష్టి, వ్యష్టి అద్వైతము, ద్వైతము, అంతర్నిహితి, పరి

జ్ఞామము మొదలగునవి వున్నవని చెప్పును. ఇది ప్రపంచమును సృష్టించి, సమష్టియగును. పురుషుడై వ్యక్తిద్వారా వ్యష్టి అగును. వ్యష్టి యందును, సమష్టియందును, తన ఆత్మనే ఎల్లెడల చూచుచు, అన్నిటిలో ప్రవేశమయి యున్నది. బ్రహ్మము ఏకముగనుండి అనేకమగుచున్నది ఈ ఆత్మ అతీత సమస్త వ్యస్తములయందు ఏకకాలీనముగా నివసింపగలదు, వ్యవహరింప గలదు ఏలన చైతన్యముయొక్క స్థాయియు నిట్టిదే. లేదేని విశ్వమెట్లు నిలుచును? సృష్టికతీత మైనట్టిదే సత్యమనియు, సృష్టి యసత్యమనియు మాయావాదము సమర్థించును.

ప్రకృతిని శంకర మతమువారు అబద్ధ (మిధ్యా) మందురు బ్రహ్మము అద్వైత సత్యమైనందున, అనేక రూపనామములలో కూడిన ప్రకృతి అబద్ధ ముగా కనబడు నదియగును. ప్రకృతి బ్రహ్మముయొక్క ప్రాతిభాసికమై, మాయయొక్క పరిణతిగనున్నది మాయ యనగా, లేనట్టిది యున్నట్లుగ కనబడునది. శ్రీఅరవిందులు ప్రకృతిని ప్రాతిభాసకమనడు పురుష ప్రకృ తులు రెండును సత్యమనియు, అనాదియనియు రెండును సత్యములనియు శ్రీఅరవిందులనును. అతీత మానస చేతనలో ద్వంద్వములు, భేదాభేదము లన్నియు సమన్వయ పరచబడి, ద్వైతమద్వైతమగును దివ్యసత్త తన అం తర్నిహితియొక్క పరమావధియైన జడమునుండి పరిణామక్రమమున ఉత్త రోత్తరముగా నావిర్భూతమగుచు, ప్రాణమనోధాతులను వ్యక్తము జేయు చున్నది ఈ పరిణామము ముందుకు జోయెనేని వీనికన్న సూక్ష్మతరము లును, శక్తి మత్తరములును అగు స్వతఃస్ఫురణము, అధిమానసము అతీత మానసము(విజ్ఞానము Super-Mind) వ్యక్తములగును చైతన్యమునకును, జడమునకు సత్తకును సంభూతికిని తోచు విరోధమంతయు ఈ విజ్ఞానము నందంతరించుచున్నది.

శంకరుల ప్రకారము అధ్యాసమనగా, ముందెచటనో జూచినది జ్ఞాపకముచే మఱల కనబడుట, అనగా కాని వస్తువున్నట్లుగ తెలిసికొనుట, (అతస్మి స్తబుద్ధిః) ద్వైతములేని బ్రహ్మమొక్కటియే యున్నప్పుడు అధ్యారోపితమైన వస్తు వెచటినుండి వచ్చును? దీనిని నిరూపించుటకు శంకరులు మాయను కల్పించి, బ్రహ్మము సత్తుఅనియు, మాయ అసత్తనియు నిర్ణయించెను. శ్రీఅరవిందులు బ్రహ్మనుండి మాయను నిషేధింపక, మాయకూడ నిజమనియు, మాయ బ్రహ్మయొక్క వేఱుపరుపరాని యదార్థ, సృజనశక్తి యనియు, సత్యాద్వైతమును (True-Advaita) అనగా సర్వము బ్రహ్మమనియు దానిని ఆత్మ–అనాత్మ, సత్తు–అసత్తులుగా విడదీయరానిదనియు, బ్రహ్మమొక్కటియే యన్నచో, సర్వము బ్రహ్మమనియు చెప్పును. సచ్చిదానందమనగా అతీత, సమస్త వ్యస్తములయొక్క సంయోజనా ఏకత్వము, బ్రహ్మము ప్రపంచములోను, వ్యక్తిలోను తనశక్తిచే వ్యవహరించు చున్నది. గనుక జగమునందేదియు అసత్యముకాదు. ప్రతివస్తువు అనంత సంభావ్యతలతో నిండియున్నది.

శంకరుల ప్రకారం ముక్తియనగా బుద్ధి, అహంకారము, ప్రాణము, యింద్రియములు, శరీరము, ప్రపంచము, వస్తు వ్యవహారములు వీటినన్నిటిని అసత్యమని తలచి, కేవల నిర్విశేష, అఖండ బ్రహ్మలో లీనమగుటయు, ఎల్లపుడు ఏకము, అద్వితీయముగానున్న వస్తువును తెలిసికొనుట, అందులో స్వముక్తికే ప్రాధాన్యము కలదు. శ్రీఅరవిందులన్ననో, వ్యక్తిగత ముక్తికి గాక, విశ్వమానవ ముక్తికిని ప్రాధాన్యము నిచ్చును. ఏలన వ్యష్టియు, సమష్టియు నొక్కటేగాన సమగ్ర ముక్తికై మానవప్రయత్న మవసరమని ఆయన చెప్పును. అతీతముతో ఐక్యత బొందినపుడు విశ్వములోని సమస్తమును త్యజించక, సమస్తమునకు కూడ ముక్తినభిలషించవలెను. ముక్తి

యనగా, జగము నుండి పారిపోవుటయు ప్రపంచముతోటి సంబంధముల విడనాడుట కాక దివ్యజీవనము, వ్యక్తిలోను సమస్తములోను, ప్రపంచము లోను నెలకొల్పుటయే

శ్రీఅరవిందుల ప్రకారం అతీతమును కనుగొని జగములోనికి వచ్చి దానిని స్వాధీనపరచుకొని భగవచ్ఛక్తి చైతన్యానందములతో యునికినందంత టను పైన క్రింద సర్వత్ర విహరించుటయే, ప్రపంచము మాయ కాదనియు మాయాశక్తి బ్రహ్మముయొక్క సచ్చిదానంద స్వరూప సమగ్రభాగమనియు, ఆయన చెప్పును.

ముక్తికి ప్రధానమైన మార్గము జ్ఞానయోగమని శంకరతత్త్వము నిరూ పించును. జ్ఞానాగ్ని సర్వకర్మలను భస్మీకృతము జేసిన ముక్తినిచ్చును. గనుక వైరాగ్య విచారణలకు ప్రాముఖ్యత శంకరతత్వములోనున్నది. "భజ గోవిందము" "వివేకచూడామణి" మున్నగు గ్రంథములలో సన్యాసమునకు ప్రాముఖ్యత యివ్వబడినది. కాని శంకరులు మహాతాంత్రిక యోగియు పరమ భక్తుడనకూడ వారి మహోన్నత స్తోత్రరత్నావళి నుండి తెలియనగును. అటు లనే ఆయన స్థాపించిన మఠములనుబట్టి, చేసిన కార్యములనుబట్టి శంకరులు గొప్ప కర్మయోగి యని తేలుచున్నది. కాని ఆయన వ్రాసిన భాష్యములలో భక్తి, కర్మల ప్రాధాన్యతను నొక్కి చెప్పకుండబోవుట మన దురదృష్టము.

అటులనే ఏకత్వానేకత్వములను, సక్రియత్వ నిష్క్రియత్వములను సమన్వయపరచు వాక్యములు శ్రీ శంకరులు ఈ క్రిందివిధముగ వారు వ్రాసియు, ఈ భావమును సమగ్రముగ వారనుసరించి విశదీకరించకుండుట గూడ మన దురదృష్టము.

"అస్తినాస్తిత్యా ద్యాశ్చ్యయానంతో వాఙ్మనసోయేర్భేదా యత్రైకం భవతి . అస్తినాస్తి, ఏకంనానా, గుణవగుణం. జానాతినజానాతి, క్రియావద క్రియం, ఫలవదఫలం, సబీజం నిర్బీజం, సుఖం దుఃఖం, మధ్యమమధ్యం శూన్యమశూన్యం, పరోఽహమన్య ఇతివా సర్వావాక్ప్రయాత్యయా గోచరే స్వరూపే యో వికల్పయతు మిచ్ఛతి. సనూనం ఖమపి చర్మవద్వేష్టయితు మిచ్ఛతి సోపాన మివచపద్భ్యామారోఢుం, జలేచభౌచ మీనానాం, వయసాంచ పదం దిదృక్షతే ."

" కలదు లేదు లోనగు వాఙ్మనస భేదములెన్నిగలవో అవన్నియునేచట నేకమగునో . కలదు లేదు, ఏకము అనేకము, సగుణము అగుణము, ఎఱుక కలది ఎఱుకలేనిది, సక్రియము అక్రియము, ఫలము కలది ఫలము లేనిది, సబీజము నిర్బీజము, సుఖమైనది దుఃఖమైనది, మధ్యము అమధ్యము, శూన్యము అశూన్యము, ఆది పరము దానికంటె నేను అన్యుడను అనిగాని, అన్నిమాటలకును తలపోతలకును అందని స్వరూపము విషయమున ఎవడు వికల్పింప నెంచునో అతడు నిజముగా నాకాశమును చర్మమునువలె చుట్టబెట్ట గోరుచున్నాడు. మఱియు దానిని మెట్లనువలె పాదములతో ఎక్కగోరుచున్నాడు. నీటియందును మింటియందును చేపలయొక్కయు పక్షులయొక్కయు అడుగుజాడలను చూడదలచుచున్నాడు . ",

శ్రీ అరవిందులు అన్నియోగములను సాధించి పూర్ణయోగ దివ్యజీవితా తత్త్వములను నిర్ణయించెను. ఇవి సర్వవేదాంతమునకు తంత్రశాస్త్రమునకు సమగ్రదర్శన ప్రయోగములుగనున్నవి. శ్రీఅరవిందుల తత్త్వము సంయోజకాద్వైతమని చెప్పవచ్చును.

శంకరారవిందులిరువురును మహా మేధాశక్తి గలవారనుటలో సందియములేదు. వీరిద్దరు గొప్ప తపస్సంపన్నులు, ధీరులు, మహామానవులని చెప్పవచ్చును. వీరిద్దరి తత్త్వవాఙ్మయముల నెల్లరుపరించి, వీలైనంతవరకు సమన్వయపఱచి, పురోగమించుట మన విధియైయున్నది.

## మాయావాదము, శక్తివాదము :

త్రికాలములైన భూత భవిష్యద్వర్తమాన కాలములందును, నాలుగవస్థలైన జాగ్రత్స్వప్న, సుషుప్తి, తురీయములందును మార్పుజెందని పరవస్తువే సత్యమైనది, యదార్థమైనదని శ్రీ శంకరులందురు అతీతానుభవమగు నిర్విశేషజ్ఞానమే నిక్కువమనియు, మిగతవన్నియు మిథ్యలనియు, ఉండుటయను సచ్చిదానందమే నిజమనియు 'అగుట' యను జగత్ప్రపంచము అసత్యమనియు శంకరమతము. ఈ తత్త్వరీత్యా, పారమార్థికము, వ్యావహారికము, ప్రాతిభాసికము యను మూడు భూమికలు సత్తాకున్నవి. ఊర్ధ్వభూమిక, క్రింది భూమికను అసంగత మనును, కాదనును. ఉపాదానము, కార్యాపత్తి సమసత్తాకు చెందినపుడు పరిణామము కలుగును ఉదాహరణము మృత్తిక, ఘటము, పాలు, పెరుగు. పాలు ఉపాదానము. పెరుగు కార్యజాతము. ఉపాదానమునకు, కార్యజాతము విషయమైనపుడు, అనగా ఒకటి వ్యావహారికమునకు, యింకొకటి ప్రాతిభాసికమునకు చెందినపుడు, వివర్తము సంభవించును, ఉదాహరణము : రజ్జు, సర్పము - రజ్జువుయొక్క సత్తా, వ్యవహారికము రజ్జు-సర్పము, ప్రాతిభాసిక మగుచున్నది. అదే కారణముచే రజ్జువు, జగత్ప్రపంచము, శుద్ధచైతన్యముతో పోల్చినపుడు వివర్తమగుచున్నది. మార్పులేమియే సత్యమైనపుడు తురీయావస్థతప్ప మిగత అవస్థలైన జాగ్రత్స్వప్నసుషప్తులు అనిత్యమగు చున్నవి. ప్రపంచములు వచ్చుచు

పోవుచున్నవి. గనుక యివి యదార్ధముకావు. మార్పుజెందని పరవస్తు వొక్కటియే యదార్ధమైనది.

శాక్త అద్వైతవాద ప్రకారము శక్తియు, శక్తిమాన్ యీ రెండును ఒకటే. అగ్నికాలును అని చెప్పుదుము, కాని కాలుట అనునది అగ్నియే, అగ్నివేరు, కాలుటవేరు కాదుకదా? అఖండ పరమస్థితిలో శివశక్తులు అవినా సంబంధము కలిగి ఒకటిగనున్నవి. క్రియారూపకమగు బ్రహ్మమే శక్తి యనబడును. క్రియలేనపుడు పరమస్థితిలో శివశక్తులు ఒకే తత్త్వముగ నున్నవి శివుడు చిత్తుగను, శక్తి, చిద్రూపిణిగ నున్నవి ప్రపంచ సృష్టికిముందు నాదస్పందనములేని స్థితి అది. పరవస్తువు రెండుదశలు కలిగి యున్నది, ఒక దశలో అది మార్పులేనిదియు, యింకొక దశలో అది మార్పు నొందునదియుగ నున్నది. ఏకములో అంతర్నిహితమైన పదార్ధమే, భేద ములో రెండుగా కనబడుచున్నది. అందువలన బ్రహ్మము నుండి జగత్తు ఉద్భ వించి ఈ రెండింటికి సంబంధమేర్పడి యున్నది.

జీవుడు మాయతో కూడిన, అసత్యములైన మనోశరీరములు ధరిం చిన ఆత్మస్వరూపుడని శంకరులనును. గనుక ఈశ్వర సంయోగమునకు, జీవుడు మనోశరీరములను విసర్జించవలెను. శాక్తేయుడు దేనిని విసర్జించడు. జీవాత్మ శివుడనియు, అతని మనోశరీరములు శివశక్తియనియు యితడు తల చును, జీవాత్మ, పరమాత్మ ఈ రెండును శివశక్తులే. జీవాత్మ అనేకముగ నున్నది. పరమాత్మ ఏకముగనున్నది. గనుక జీవుడు బ్రహ్మము కానట్టి అసత్యముతో కప్పబడిన ఆత్మగాక, తన స్వశక్తితో కూడుకొన్న ఆత్మయే యగును.

శాక్తేయులు, మాయావాదులు, వీరిరువురు పురుష ప్రకృతుల రెండిం టిని అంగీకరించుచున్నారు. కాని మార్పులేని ఆత్మయొను ఏకమునకు, మార్పుజెందు బహుత్వముగల శక్తికి, సామంజస్యము కుదుర్చుటలో వీరిలో భిన్నాభిప్రాయములు కలిగినవి జగత్తనునది మాయాకల్పితమై, దీనికి కారణ మరయుట నవసరమని మాయావాదులందురు. శాక్తేయులు, సృష్టికి పూర్వపు స్థితిని చణక గింజకు పోల్చుచు, ఈ గింజలోని రెండువిత్తనములు, శివశక్తు లవలె ఒకే పొట్టుక్రింద అణిగియున్నట్లు చెప్పుదురు. ఈ ద్వైతరూపముతో నున్న ఏకముయొక్క మైథున స్పందనముచే నాదము, తద్వారా బిందువు ఉత్పన్నమై, దీనినుండి క్రమముగా జగత్తు పుట్టుచున్నది నిజస్థితిలో శివ శక్తులు రెండు ఒకటిగానుండి, యెప్పుడు వేరుపరుపరానివి. ఈ శక్తియే అనేక రూపముల సృజించును. వీటిపైకి ప్రధానమైనవి చిత్-శక్తియు, మాయాశక్తియు. మాయ అనగా ఒక గొప్ప వింతయైనట్టి అచేతనముకాదు. ఇదియొక సత్తు కానటువంటి, సదసత్తుకానటువంటి, అబ్రహ్మము కాదు. మాయ యనునది శక్తియొక్క రూపము. అది నిత్యవస్తువైన శివ స్వరూ పమే. మాయా స్వరూపము, బ్రహ్మమే, చైతన్యమే యగును. అది బ్రహ్మ మైనందున సత్యమే యగుచున్నది. తన స్వరూపమును మరుగుపరచడము ద్వారా దాని శక్తుల్భవించును.

శంకరులు ఒకే సత్యము, ఒక సదసత్తుచేతన, వున్నవని చెప్పుదురు, అచేతనముగా కనబడు దానిపైన సత్యచేతనయొక్క ప్రకాశము పడినపుడు అది చైతన్యము కలిగినదిగా కనబడుననియు, దీనినే చిదాభాసమని శంకరు లందురు. కాని శక్తివాదము ప్రకారము అచేతనముగా కనబడునదంతయు, శక్తి తనయొక్క చేతనను మరుగుపఱుచుటచే గోచరమగు నొక యంశ మనియు నిజముగా సర్వము సచేతనమే. శక్తి బ్రహ్మమా? బ్రహ్మముకాదా?

అది బ్రహ్మముయొక్క శక్తి అయినపుడు అది అసత్యము కానేరదు. ఏలన సత్యమైన బ్రహ్మములో అసత్యమెప్పుడుండనేరదు. శక్తి, చేతనావంతముగ నుండవలెను. లేనిచో బ్రహ్మములో అచేతన మున్నట్లగును, గనుక శక్తి బ్రహ్మమే. "సర్వం ఖల్విదం బ్రహ్మ" సర్వము బ్రహ్మ మన్నప్పుడు బ్రహ్మము ప్రపంచము, రెండును నిజమే. చేతనాయుతమైన శక్తి ప్రపంచ కారణమైనపుడు అచేతనమునకు చోటులేదు.

శాక్తేయులు, మాయావాదులు, బ్రహ్మము రెండు దశలుగనుండు విషయములో ఏకీభావము చూపుచున్నారు. ఒక దశలో బ్రహ్మము అతీతము గను (Transcendent) యింకొక దశలో సృష్ట్యాత్మకముగను, అంతర్నిహితముగ నుండుట వీరంగీకరించుచున్నారు. సాంఖ్యమతములో నున్నట్లు ప్రకృతికి యదార్థత, స్వాతంత్ర్యము, శంకరమతములో లేదు. మఱియు బ్రహ్మమును శక్తితో కూడిన ఈశ్వరుడుగా నొకవైపు, మఱియొక వైపున శక్తిరహితమాయగను శంకరులు చూచుచున్నారు. వీరు మాయయనునది, యొక అనిర్వచనీయ అచింత్య రహస్యమనుచున్నారు. మాయ సనాతన మిథ్యాభూతముగ నున్నదనియు సత్తుగాని, అసత్తుగాని ఏదోయొకటిగ నున్నదని వారందురు. అది బ్రహ్మమునందలి భాగము కాకపోయినను బ్రహ్మముతో సంబంధము కలిగి ఈశ్వరాంశ సంబంధమైన భ్రమాశ్రిత మాయగనున్నది, అది సదసత్తుగ నున్నది. అచేతనమైన ప్రకృతి లేక మాయలో, సచేతనమైన పురుషుడు లేక బ్రహ్మముయొక్క ప్రతిబింబమువలన ప్రపంచము కలుగుచున్నది, ఈ విధముగ అచేతనము సచేతనముగ కనబడినట్లు చేయబడుచున్నది. ఇదియే చిదాభాసము.

మాయ మిథ్యారూపముగ నున్నది. ఐనను అది అభావముగ లేక

భావరూపమైన అజ్ఞానముగన్నది. ప్రకృతి పురుషుని మరుగుపరచినట్లు అది ఆచ్ఛాదికస్వభావముగల యొకశక్తిగనున్నది. ఒకప్పుడు బ్రహ్మము మాయతో కూడినదిగను, యింకొకప్పుడు కూడనదిగయున్నను ఈ రెండు కోణముల లోను బ్రహ్మమునకు మార్పులేదు. కాని శాక్తేయుల ప్రకారం శివుడు శక్తి రూపముగ నున్నపుడు మార్పుజెందును.

శాక్తేయులు ప్రపంచమును యదార్థమనుచున్నారు బ్రహ్మము, ప్రపంచము రెండును చైతన్యపదార్థములే. మానవుని ఆత్మ శివుడు. మానవుని మనోప్రాణశరీరములు శక్తి. శివశక్తులొక్కటియేగాని వేరుకాదు. పరమాత్మ, భేదరహిత, శివశక్తి. జీవాత్మకూడ యీ శివశక్తి స్వరూపమే. మానవుడు తన మాయా శక్తితో కూడుకొన్న, ఆత్మయగు చున్నాడు. చిత్-శక్తిగ నున్నను, మాయా శక్తిగనున్నను, సర్వము శక్తియే. ఇది యంతయు, బ్రహ్మమన్నప్పుడు "ఇది" యనగ బ్రహ్మమే, శక్తిరూపమని యర్థము.

శివుడు తన పరబ్రహ్మ స్వరూపమున, శివశక్తులుగ నున్నాడు. ఆ స్థితిలో శక్తి, తనకుతానై, చిద్రూపిణిగనుండి క్రియాత్మకముగ పనిచేయుట లేదు. శివుడు, మాయాశక్తితో కూడినపుడు ఈశ్వరుడై, కదలికకు, మార్పులకు, కారణభూతుడగును. అప్పుడు మాయకులోనై, శివశక్తి జీవుడగును, ఈశ్వరుడు మాయాతీతుడుగనున్నాడు. ఈ సృష్ట్యాత్మక శక్తియే మార్పులేని చిత్‌శక్తియు, మార్పుజెందు మాయా శక్తియు నగుచున్నది. పరవస్తువు ఒకే శక్తియయ్యును. రెండు శక్తులుగ గోచరమగుచున్నది. గనుక ఈ రెంటిని అనగా చిత్-శక్తి, మాయాశక్తి— వీనిని వేఱుపరుపరాదు. మాయా శక్తి అచేతనముకాదు. ఏలన అది చిత్‌శక్తి భాగముగనుండి, దానితోనేకీభవించి యుండును. శక్తియంతయు చైతన్యమయమే. బ్రహ్మపదార్థ మొక్క

టియే చిత్తుగను, మాయాశక్తి స్వరూపముగను యున్నది. సర్వము చైతన్యమే (All is Consciousness).

కాని, వస్తువులలో అచేతన కనబడుచున్నదిగదా ఎందుకు? చైతన్యముతో కూడిన శక్తియే, తనచేతనను మితపరచుకొని, జగదభివ్యక్తి కొఱకు రూపములను సృష్టించుటకును, తనచేతనను, మరుగుపరచుచున్నది అనగా మనో జడములుకూడ వాటి మూలస్వరూపములో చిత్ స్వరూపములైనను, అవి అచేతనముగనో, హద్దుకలిగినవిగనో, చేతనయొక్క ఆవరణ శక్తి యగు మాయాశక్తి ప్రభావముచే కనబడుచున్నవి. వివిధ రూపములతోనుండు ప్రపంచమంతా శక్తిమయమే అది ఆత్మ మనో జడములుగ కనబడుచున్నది.

జగదభివ్యక్తికిముందు మహాసత్తా యుండినది శక్తిలేని స్థితియేలేదు. 'ఉండుట'యందు 'అగుట'యందు శక్తియున్నది అభివ్యక్తముగాక, స్వరూపములో నున్నపుడు, శక్తిని చిన్మయి, ఆనందమయి యందురు. సృష్టికి పూనుకొన్నపుడు, మహాసత్తా నుండి ఆద్యశక్తి విజృంభించి, మనోప్రాణ జడములుగ వ్యక్తమగును. ఈ ఆద్యశక్తి, రూపాతీతముగ నున్నను, అనేక రూపములను సృజించి, పోషించి లయమొనర్చును.

మాయావాదానుసారము మనోజడములు వస్తుతః అచేతనముగనున్నను చిదాభాసమువలన, చేతనాయుక్తముగ నున్నటుల కనబడును. శక్తి వాదము రీత్యా యివి వస్తుతః, అనగా వాటిమూలమున చేతనా సహితముగ నున్నను అవి, అచేతనముగనో, లేక మితచేతనముగలవిగనో, చేతనాశక్తి తననుతాను మరగుపరచుకొని మాయాశక్తి యగుటవలన కనబడును. గనుక చిదాభాస మునకు అవశ్యకతలేదు. బ్రహ్మము తన రూపమును నిషేధించుకొనుదశలో

మాయాశక్తి యగుచున్నది. శంకరులు, ఈశ్వరుడు అచేతనౌ మాయతో సం బంధము కలిగియుండుననగా, శాక్తేయులు ఈశ్వరుడు తనకుతానే, మాయా శక్తి రూపముగ యున్నాడు అందురు.

శక్తితత్త్వము మహోన్నతముగను, శక్తివంతముగ నున్నది. ఇది ప్రపంచమునంతటిని, శివశక్తి, దేవదేవి స్వరూపములుగను, మనకు గోచ రించు జగత్తుగను, యదార్థముగను జూచును. ఇది దేనిని తూలనాడదు దేనిని నిరసించదు ఇది మనకు స్థిరబునాదులు జేకూర్చి, ప్రపంచము నిత్యమనియు యిందుండి పలాయనమగుట మంగళకరముకాదని చెప్పును మాయావాదము వలన పలువురు భ్రమచిత్తులై, ప్రపంచమునువీడి, సన్యాసధర్మము నవలం భించు చున్నారు. ప్రపంచమంతయు, భగవానుడనియు, భగవతియనియు, తెలిసికొన్నపుడు జగత్తును వీడిపోనక్కరలేదు. సర్వము సత్యం, శివం, సుందరమని అనుభూతిపొంది, దివ్యజీవనము చేయవచ్చును. శక్తితత్త్వము పూర్ణాద్వైతమును మనకిచ్చును. మాయావాదముకంటె, శక్తివాదము శ్రేష్ఠ మని జెప్పవచ్చును.

## తంత్రశాస్త్రసారము:

జీవబ్రహ్మల ఐక్యమే ముక్తి. జీవాత్మయు, పరమాత్మయు నొకటే యని తెలిసికొనుట మూలవిద్య. మానవుడు క్షుద్ర బ్రహ్మాండము. ఈ లోక ములో నున్నదంతయు, జగత్తులోని యితర లోకములలో నున్నది. ఇచ్చట నున్న దితరచోటులోనున్నది: ఇచట లేనిదెచటను లేదు. (యద్ యిహాస్తి తదన్యత్రా, యాన్నేహాస్తి నతత్క్వచిత్).

ఆత్మ, మనస్సు, జడము—మానవుడివన్నియునై యున్నాడు. ఆత్మ ఏకము. ఇందులో గుణభేదములులేవు. మానవునిలోనుండు ఆత్మ ప్రతి వస్తువులోనుండు ఆత్మయే, పూజింపదగిన యీ వస్తువే దేవుడు, శివుడు, ఆత్మపూర్ణము అఖండముగనున్నది. మనోభౌతికములు (Mind and Matter) యీ పూర్ణములోని అంశములు. ఇవి ఖండము అపూర్ణముగ నున్నవి. ఆత్మ అపరిచ్ఛిన్నముగను, అరూపముగ నున్నది మనోభౌతికము లన్ననో, పరిచ్ఛిన్న రూపములతోనున్నవి. ఆత్మ అచంచలము, మార్పులేని దిగ నున్నది. మనోభౌతికము లెల్లప్పుడు చలనముగలవై, మార్పునొందు చున్నవి. పరిశుద్ధచేతన, చిత్తులేక సంవిత్తుగ నుండగా, భౌతికము దీనికి వ్యతిరిక్తముగ నున్నది మనస్సుకూడ పరిమిత చైతన్యము కలదైయున్నది. చిత్తు అమనస్కమైనను, దీని యాధారములేని మనస్సులేదు. చేతన చిత్తును పరిమిత మొనర్చక పోయినను, ఆ చేతనయొక్క యొక తత్త్వము, దీనిని పరిమిత మొనర్చుచున్నది. అచేతనమగు మనోభౌతికములలో రూపొందిన శుద్ధ చైతన్యమే మానవుడు.

పరమసత్యము, చిత్తు, లేక సంవిత్తు. దీనినుండి దీనిశక్తిమూలమున మనోభౌతికములు (Mind and Matter) కలుగుచున్నవి ఈ శుద్ధ చైతన్యమే శివుడు. ఆయనతోనేకముగనున్న ఆయన శక్తియే, ప్రపంచమునకు మాతయగుదేవి. ఈశక్తి, మానవశరీరములోని క్రింది చక్రమైన మూలాధారములోనుండి, పైన తలలోనున్న సహస్రదళ చక్రములోని శివుని పొందుచున్నది. సాధకుని శరీరములో శివశక్తుల సంయోగమే పూర్ణయోగము.

వేదము, "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనగా, ఇదంతయు అనేక బ్రహ్మాండమంతయు బ్రహ్మమని చెప్పుచున్నది. అనేక సోపానములొకటి

యగుననుటయే సర్వదర్శనసారము. తంత్రశాస్త్రరీత్యా, దేవి, "ఏకానేకాక్షర కృతిః" అనగా ఏకముగను అనేకముగనునున్నది. అనేకముగ కనబడు, ఏక సత్యముయొక్క స్వరూపమేమి ? ఇది సచ్చిదానందము. చిత్తు (సంవిత్తు) సత్తుతో నొకటిగనున్నది. కాని సాధారణ అనుభూతిలో యివి వేఱుగా నున్నట్లు గోచరించును. జీవాత్మయొక్క చేతన, మాయచే కప్పబడినందున యీభేదభావ ముదయించుచున్నది కాని పరమాత్మానుభూతి కలిగినపుడు యీ భేదము లయమగుచున్నది. ఇది సత్ చిత్ ఆనందము కూడ నై యున్నది. అది పూర్ణముగనున్నందున, అది కోరవలసినదేమియులేదు. సత్యముయొక్క స్వరూపము ఆనందమయ చేతన, ఈ పరాచేతనయే మార్పుజెందని పరమ శివుడు. ఇదియే అన్ని మార్పులలో మార్పుజెందని పరమవస్తువు.

కాని మనము చూచునదంతయు అచేతనముగ ఎందుకగపడుచున్నది? మనమనస్సు, నిజస్థితిలో పరిశుద్ధచేతనకాదు. ఇది పరిమిత చైతన్యము. దానిని మితపఱచునది దానిలోనుండు నేదోయొక యచేతనమై యుండవల యును, లేదా అది (మనస్సు) చేతనయే యైనచో, అచేతనత్వమును ప్రతిభా సించు శక్తి గలదైనదిగనైన యుండవలెను. ప్రపంచములో పూర్తి చేతనా రహితమైనట్టియు కేవల చైతన్యముతోనుండునట్టియు, వస్తువేదియును లేదు, చేతనాచేతనములు రెండును ఎల్లపుడు మిశ్రమములుగా నున్నవి. కొన్నింటిలో చేతన నెక్కుడుగను, మఱి కొన్నింటిలో అచేతన మెక్కుడుగను కనబడు చున్నవి. దీనికి కారణమేమన చిత్తుబొత్తిగాలేని వస్తువేదియునులేదు. వస్తు వుయొక్క స్వభావ ప్రగతిననుసరించి, చిత్తు ఆ వస్తువులో అభివ్యక్తమగు చుండును. కాని ఆత్మ సమస్త వస్తువులలోను మార్పుజెందకుండా ఒకటిగా నున్నది శరీరము మాత్రమే మార్పుజెందును. లోహమునుండి మానవుని వరకు ఆరోహణ క్రమపరిణతిలో, చైతన్యము అభివృద్ధి చెందుచుండును.

లోహమునకన్న వృక్షజాతిలో చేతనా ప్రకాశమెక్కువగ నున్నది. వృక్షజాతి కన్న జంతుజాలములో చేతనా ప్రకాశమింకను నెక్కువగ గోచరమగును. తుదకు మానవ దశకుపక్రమించినపుడు చేతనాపరిణతి, మఱింత ప్రకాశవంత మగును. ఈ పరిణామ దశలన్నిటి వెనుకను, మార్పుజెందని నిరాకారచిత్తు, తన స్వస్వరూపముతో నున్నది చిత్తునకు, జీవిత పరిధులలో యెక్కువ తక్కువలు లేవు చిత్తు, మనోజడములచే కప్పబడినందున, అది వృద్ధిపొం దినట్లు, తగ్గినట్లు కనబడుచుండును. తన శక్తియొక్క దాపరికముచే, జగత్తు సృష్టింపబడుచున్నది అయితే చిత్తును మరుగుపరచి తద్వారా, ప్రపంచాను భూతిని కలుగజేయునదేది ?

అదియే మాయాశక్తి. ఏది పూర్ణమును అపూర్ణముగను, అనంత మును అంతముగను, నిరాకారమును ఆకారముగను చేయునో, అదియే చిత్తుయొక్క మాయాశక్తి ఏది శుద్ధచైతన్యమును తగ్గించి, మూసిపెట్టి, లేదనిపించునో, అదియే మాయాశక్తి. అట్లయిన ఈశక్తి శివునికంటె భిన్న మా ? కాదు. అదియు శివుడే ఏలన అట్లుగానిచో సర్వము బ్రహ్మము కా కుండబోవును గనుక అది చిద్రూపిణియు, సచ్చిదానందమయియు నగును.

కాని ఉపరితలమున కొంత భేదమగుపడుచున్నది. శక్తిమంతుడైన శివునికి శక్తికి భేదములేదు. శివుడు, శక్తియు రెండును చేతనయైనను శివుడు ఆచేతనయొక్క మార్పులేని అచలస్థితిగను, శక్తి, ఆ చేతనయొక్క క్రియా రూపకముగను మార్పునొందు, ఉధృతస్థితిగ నున్నది. ద్వంద్వములతో కూడిన ప్రపంచమును సృజించుశక్తి మాయాశక్తి. ఇది ఆవరణ విక్షేప ములు కలిగిన శక్తి. ప్రపంచము ఈశ్వరునియొక్క సృష్టి కల్పనగనున్నది. ప్రపంచము, యిందులోని వస్తువులు, ఒకే పరమాత్మయైనను, వీనిలో భేద

మగుపడునట్లు చేయుశక్తియే మాయాశక్తి. శక్తి తనచేతనను కొంచెము కొంచెముగా పరిమితమొనరించుకొనుటచే, శక్తియొక్క చేతనావరణము సంభవించును.

ప్రపంచ సృష్టికిముందు సచ్చిదానందమొకటియే, శివశక్తిగను, చిత్తుగను, చిద్రూపిణిగ నుండెను. చిత్తు తన శక్తిని వినియోగ పరచకుండ యుండునట్టి స్థితిలో అది మార్పులేనిదిగ నుండెను. ఈ నిశ్చలాత్మస్థితిలో, శక్తి అంతర్భూతముగ నుండి, ఆత్మలో నైక్యముగా నుండెను అనగా సచ్చిదానందములో శక్తి ప్రకృతి స్వరూపిణియయ్యి దాగియుండెను. ప్రపంచము, ప్రళయకాలమున లయమైనపుడు, చేతన, సూక్ష్మరూపములో దాగి యుండెను. కాని మార్పులేని ఒకే చైతన్యమున్నపుడు, ప్రపంచసృష్టి యసంభవమగును. నిర్గుణ నిష్కళాస్థితిసే 'పరస్మవిత్' యని తాంత్రికులు;పరబ్రహ్మమని వేదాంతులు అందురు. ప్రపంచ సృష్టికి పూనుకొన్నప్పుడు శివశక్తిలోని శక్తి, నిషేధవ్యాపార రూపమును దాల్చి (Negates Herself) తాను "ఇది" (This) అయి, శివచైతన్యము "నేను" (I) గా నగును. పరమ శివుని యొక్క ప్రకాశనమువలన, ఆతని శక్తి విమర్శాశక్తియై విశ్వమునంతటిని సృజించుచున్నది.

పరాశివుడు, పరాశక్తి, నిష్పంద, నిశ్శబ్దములుగనున్నవి. పరాశక్తి నుండి మొదలు శబ్దబ్రహ్మము కలుగుచున్నది దీనినుండి శబ్దార్థములు, వానిననుసరించి భాష పుట్టుచున్నవి. బిందువు అనగా 'నేను' అనునది 'ఇది' అనుదానితో నైక్యము కానట్టి ప్రపంచ సృష్టిస్థితియొక్క శక్తి. చేతన ఒక వస్తువు తనకు భిన్నముగా నున్నట్లు కనుగొనినపుడు, ఆ వస్తువును అది యొక దేశములో విస్తరింపబడినట్లు చూచును. కాని యిదే వస్తువును

పూర్తిగా సూక్ష్మదశలో చూచినపుడు అదియొక బిందువుగా గోచరించును. అనగా ఘనీభూతముగానున్న జగద్వస్తువు ప్రపంచముగా స్ఫురణమంది, సృష్టింపబడుచున్నది

ప్రళయ కాలములో ప్రపంచ మెచటికి బోవును? ఏశక్తి ప్రపంచ మును సృజించెనో, ఆ శక్తిలోనికది లయమగుచున్నది. అప్పుడు శక్తిలో దేశకాలములు లోపించును శివశక్తి తత్వమునుండి వచ్చిన శివబిందువు శివ శక్తిలోనికి లయమగును.

శివబిందువుచుట్టను శక్తిచుట్టుకొని యున్నది. అటులనే మానవశరీర ములో పృధ్వీకేంద్రమైన మూలాధార చక్రములో, స్వయంభువు లింగము చుట్టును ఒక సర్పము చుట్టుకొనియున్నది. ఒక చణకధాన్యపు గింజలో రెండు విత్తనములు, ఒక పొట్టు అను పొరచే కప్పబడియున్నట్లు ద్వంద్వ స్థితిలోనున్న అభేదపుగు ఏకత్వమిచట నున్నది. ఈ రెండువిత్తులు శివశక్తులు వీటిని ఆవరించిన పొట్టు మాయ. శివుని చుట్టుకొని శివునిలో నొకేబిందువుగా నుండు శక్తినే, కుండలినీశక్తియని యందురు అటులనే, పరమశివుని చుట్టుకొనియుండు శక్తిని మహాకుండలినీయని యందురు.

సనాతన బ్రహ్మరూపముయొక్క ఒక అవస్థ కుండలినీ శక్తి. ఇది నిర్గుణముగను, సగుణముగనున్నది. ఆమెయొక్క నిర్గుణస్థితిలో చైతన్య రూపిణిగను, ఆనందరూపిణిగను సృష్టిక్రమములో బ్రహ్మానంద ప్రకాశినిగ నున్నది. సగుణస్థితిలో, సర్వభూత ప్రకాశనశక్తియగుచున్నది. మూల ప్రకృతినుండి వికృతిరూప మొందుటయే సృష్టి. మరల మూల ప్రకృతిలోనికి లయమగుటయే ప్రళయము. ఈ పరిణామ ప్రళయములు సదా జరుగుచునే

యున్నవి. గనుక కేవల మొదటిసృష్టి యనునదిలేదు ఒకదాని వెనుక నొకటి, సృష్టి ప్రళయములు సనాతనముగా జరుగుచున్నవి.

ముక్తిభుక్తియని ద్వివదశాసహితముగ చేతనయున్నది. సాధనవలన ముక్తియు భుక్తియు రెండును లభ్యమగును పరిశుద్ధ అవ్యక్త, సిద్ధచైతన్య ములో, సగుణరూప ప్రపంచముద్భవించినపుడు మార్పులేని వస్తువులో మార్పుకలుగును అతీతము, మార్పురహితమైనను దానియొక్క శివశక్తి దశలో మార్పుజెంది శక్తిస్పందనము వలన నాదము, నాదమునుండి బిందువు బిందువునుండి ప్రపంచములు సృజింపబడును. శాస్త్రములు ఈ సృష్టియొక్క క్రమమును, తత్వముల రీత్యావిభజించినవి శక్తి ఆగమములు ఈ సృష్టి క్రమమును ముప్పైఆరు తత్వములుగా నిర్ణయించినవి

ఆయనయొక్క అతీతావస్థలో శివుడు మార్పునొందడు, కాని ఈ 'నిష్కాల' శివుడు 'సకాల' శివుడగుటకు ఇచ్ఛగలవాడైనపుడు, తన శక్తిని ప్రసరింపజేసి తద్వారా రూపనామ క్రియాపూరితుడగును. ఈ ఇచ్ఛా శక్తి స్పందనమువలన నాదముత్పన్నమై, బిందురూపము ధరించి, ప్రపంచము లుత్పన్నమగును కర్మసంస్కారముల వలన మహాదేవి తన మాయాశక్తి మూలమున మనోభౌతిక వికారములను తత్వములతో కూడిన "వికారిణి"గ రూపొంది జగత్ప్రసారము గావించును.

సృష్టి వికాస సమయమున కర్మసంస్కారమువలన గుణక్షోభము కలిగి యిందువలన ఒక స్పందనముదయించి దీని ఫలితముగ శబ్దబ్రహ్మము కలుగును. అప్పుడు ప్రకృతి వికృతియై ప్రపంచములు సృజింపబడును. వ్యక్తి రూపమునొందిన చైతన్యమే జీవుడు. ప్రకృతిశక్తినుండి మూడు శరీ

రములు పొందినవాడగును. జీవుడు మొదలు కారణశరీరముగలవాడై, పర మాత్మతో నైక్యమగువరకు ఈ కారణశరీరములోనుండును. కారణ శరీర మాధారముగా కలిగి యిందుండి వచ్చిన సూక్ష్మ శరీరములో జీవుడు స్వప్నావస్థలో నుండును. సూక్ష్మశరీరము, అంతఃకరణము, యింద్రియములు వీటితన్మాత్రలు కలిగియుండును. సూక్ష్మశరీరమునుండి వచ్చిన భౌతిక శరీరములో, జీవుడు జాగ్రదవస్థలో యుండును.

శక్తిశాస్త్రములో, మనస్సు ప్రకృతియొక్క ఈ క్రింది వివరించిన తత్త్వములు కలిగినదిగ యున్నది ?

(1) బుద్ధి లేక మహాతత్వము, అనగా సత్తుయొక్క ఒక చేతన,
(2) అంతఃకరణము, అనగా 'నేను' అను అనుభూతి నొందు చేతన;
(3) మనస్సు
(4) ఇంద్రియములు: ఇవి జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములను రెండు విధములు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, సూక్ష్మ తన్మాత్రలనుండి స్థూలభూతములుదయించును. బుద్ధి రధికుడుగను, సంకల్ప వికల్పములుగల మనస్సు కళ్ళెములుగను, యింద్రియములు గుఱ్ఱములుగను, జీవుడు భోక్తగను శాస్త్రరీత్యా ఉదహరింపబడినది.

పాశ్చాత్యులు చెప్పు స్థూలపదార్థముల పదార్థము తన్మాత్రలనుండి వచ్చిన మహాభూతములే. ఇవియే, ఆకాశము, వాయువు, తేజస్సు, ఆపస్సు, పృథ్వి, భౌతిక జగత్తులోని ప్రతిరూపము. ఈ భూతములన్నిటియొక్క సమ్మేళనమే ప్రతి తత్త్వమును తన స్వస్వరూపము (మండలము) రంగు కలిగయున్నది.

ACC NO- 14673
181·4
KOD

రు 2.50

శరీరమును పోషించుచు, దీనికి జీవశక్తి నిచ్చునది, 'వాయువు' అను చేతనయొక్క ప్రాణశక్తి. ఇది శరీరములో అయిదు ప్రాణములుగ అనగా, ప్రాణాపాన వ్యానోదాన సమానశక్తులుగ పనిజేయు చున్నది. ఇవిగాక శరీరములో పంచ ఉపవాయువులున్నవి. అవి నాగ, కూర్మ, కృకర, దేవ దత్త, ధనంజయ అనునవి. (ఇవి ఎక్కిళ్లు, కండ్లు మూయుట తెఱచుట, అజీర్ణత, ఆవలింపు, మృతశరీరము వీటితో ప్రస్ఫుటమగు వాయువు.)

చేతన యదార్ధస్థితిలో అవస్థలు లేకున్నను జీవస్వరూప మొందినపుడు చేతన మూడవస్థలు కలిగినదగును. జాగ్రదవస్థలో జీవుడు బాహ్యప్రజ్ఞ కలిగి స్థూలభోక్తడగును ఈ స్థితిలో స్థూలజీవశరీరమును, విశ్వమనియు, సమష్టి జీవసత్తాను వైశ్వానరమనియు జెప్పుదురు. స్వప్నావస్థలో జీవుడు అంతః ప్రజ్ఞకలవాడై సూక్ష్మశరీరములో ప్రవివిక్తభోక్తడగును సూక్ష్మశరీరము లోని జీవచైతన్యమును తైజసమనియు, సూక్ష్మవిశ్వచేతనను హిరణ్యగర్భు డనియు, సూత్రాత్మఅనియు జెప్పుదురు కారణశరీరములోని జీవచైతన్య మును ప్రాజ్ఞమనియు, కారణవిశ్వచైతన్యమును ఈశ్వరుడనియు, సుషుప్తిలో కారణశరీరమందు జీవుడు ఆనందభోక్తడగును సుషుప్తి బ్రాహ్మికచైతన్యా వస్థకాదు. దీనికావలయుండు తురీయావస్థయైన నాల్గవస్థితియందు జీవుడు మహాకారణ శరీరములో నివసించుచూ, శుద్ధవిద్యాచేతన ననుభవించును. తురీయావస్థ కావల తురీయాతీత యవస్థయున్నది ఇచట ఉన్మేషా నిమేషా చైతన్యములు ఈశ్వర సదాఖ్య తత్వములతో కూడినవై సిద్ధ శివచేతనకు తీసికొనిపోవు చేతనావస్థలు గలవు.

ప్రతి జీవుడును పరమాత్మయొక్క యొక అంశముగ నున్నను, అవిద్యా మాయచే కప్పబడి, పరమాత్మకంటె వేఱుగభావించును. ఈ యవి ద్యను నిర్మూలముజేసి, పరమాత్మ సంయోగము పొందు విధానమునే యోగ మందురు.